# కర్పూరమంజరి

(ప్రాకృతమున రాజశేఖరకవిచే రచియింపఁ

బడిన రూపకము.)

ఉభయభాషాప్రవీణ

రావూరి వేంకటసుబ్బశాస్త్రి

శ్రీరస్తు.

# కర్పూరమంజరి.

(ప్రాకృతమున రాజశేఖరకవిచే రచియింపఁ
బడిన రూపకము.)

ఇది

రాజమహేంద్రవరమునందలి దొరతనమువారి ఉన్నత
బాలికాపాఠశాలలో నాంధ్రాధ్యాపకురాలైన
ఉభయభాషాప్రవీణ

## రాపూరి వేంకటసుబ్బమ్మచే

ఆంధ్రీకరింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

ప్రకాశకులు:

## వేదుల రామచంద్రకీర్తి

ఖాజీవీధి, రాజమహేంద్రవరము.

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్‌నందు ముద్రింపఁబడినది.
రాజమహేంద్రవరము.

 [రు. 0—8—0

1935

# అంకితము.

సీ. కడుచిన్ననాఁటనె కన్నతండ్రి గతింపఁ
బ్రేమ మీఱఁగ మమ్ముఁ బెంచె నెవఁడు
ఎట్టికోర్కెల నైన నేము గోరిన నవి
కరుణతోఁ దీర్పంగఁ గడఁగు నెవఁడు
మాసౌఖ్య మెప్పుడు మదిఁ గోరి వేనవేల్
ధనము వెచ్చింపంగఁ దలఁకఁ డెవఁడు
విసువక మా కెల్లవిద్యలు నేరిపి
యజ్ఞానమును బాపి యరసె నెవఁడు

తే. గీ. అట్టినా మేనమామకు నమలమతికి
సంస్కృతాంధ్రాంగ్లభాషావిశారదునకు
చిలకమర్తి లక్ష్మీనరసింహకవికి
నంకిత మొనర్తు నీకృతి నధికభక్తి.

# ప్రస్తావన.

## రాజశేఖరకవి.

సంస్కృతమహాకవిరత్నహారములో రాజశేఖరకవి యొకయ మూల్యరత్నము. ఈమహాకవి బాలరామాయణము, బాలభారతము, విద్ధశాలభంజిక యనుమూఁడునాటకములు సంస్కృతములోను, కర్పూరమంజరి యనుసట్టకము ప్రాకృతభాషలోను రచియించెను. బాలరామాయణము పదియంకముల నాటకము. ఇతివృత్తము రామచరిత్రమే. బాలభారతమునందు రెండంకములు మాత్రమే కనఁబడుచున్నవి. బాలరామాయణమువలెనే పదియంకములు రచియింపఁ దలఁచి సమాప్తము చేయలేకపోయెనో, లేక రెండంకములు మాత్రమే రచియించెనో తెలియదు. ఇందు మొదటియంకమందు ద్రౌపదీ వివాహము రెండవయంకమందు ద్రౌపదీవస్త్రాపహరణము వర్ణింపఁ బడియున్నవి. విద్ధశాలభంజిక యనునది నాలుగంకములనాటిక. రత్నావళీ మాళవికాగ్నిమిత్రముల ననుసరించి కవి యీనాటికను రచియించెను గాని వానికిం గలప్రఖ్యాతి దీనికి రాలేదు.

కర్పూరమంజరి ప్రాకృతభాషలో రచియింపఁబడినది. సంస్కృతప్రాకృతభాషలయం దీయన కసమానపాండిత్యము గల దని దీనివల్లఁ దేటపడుచున్నది. దీనిని సట్టక మనియు, సాటక మనియు వ్యవహరిం

తురు. ప్రాకృతములో నిది యొకరూపక భేదమని తోఁచుచున్నది. ఈనాటకమున నంకములకు బదులుగా జవనికాంతరములు చెప్పఁబడి నవి. ప్రథమాంక మనుటకు మాఱుగాఁ బ్రథమజవనికాంరత మని, ద్వితీయాంక మనుటకు మాఱుగా ద్వితీయజవనికాంతర మని కవి వ్రాసియున్నాఁడు. ఈరూపకము రాజశేఖరకవిప్రఖ్యాతికిం దగి నంతప్రౌఢము గా లేదు. కథాకల్పనము మనోహరము గా లేదు. కాని, కవిత్వము హృదయంగమము గా నున్నది. కల్పనలు గూడ కొన్నిపట్ల మిక్కిలి రసవంతములు గా నున్నవి.

ఈకవి క్షత్రియుఁడా బ్రాహ్మణుఁడా యని కొందఱకు సందేహము గలుగుచున్నది. ఇతఁడు మహేంద్రపాలదేవుఁ డనురాజున కుపాధ్యాయుఁడుగా గురువుగా నుండినట్లు దనపుస్తకములో వ్రాసికొ న్నాఁడు. ఉపాధ్యాయుఁడు బ్రాహ్మణుఁడు గాకపోవునా యని వితర్కించి కొందఱు బ్రాహ్మణుఁ డనుచున్నారు. కాని, యతనిభార్య చాహువానవంశజాత యని కవి గ్రంథములలోఁ జెప్పుకొన్నాఁడు. చాహువానవంశ మనఁగా చౌహాణవంశము. ఏవంశమునందు రాణా హమీరుఁడు, జగత్ప్రసిద్ధుఁ డైనపృథ్వీరాజు మొదలగుమహాశూర శిఖామణు లగురాజన్యులు జన్మించిరో యావంశమే చౌహాణవంశము. అట్టి క్షత్రియవంశమందు జన్మించినకన్య కలియుగములో బ్రాహ్మణు నెట్లు వివాహమాడును? పూర్వయుగములలో నది యాచార మై యుండిన నుండుఁ గాక. కలియుగముతో నట్టియాచారము లేదు. కాఁబట్టి రాజశేఖరుఁడు గూడ క్షత్రియుఁడే యని నిశ్చయింపవలెను. క్షత్రియుఁడు మాత్రము మఱియొకరాజునకు గురువుగా నుండఁగూ

డదా? బ్రాహ్మణులు మొదలగుద్విజుల కందఱకు నుపాస్య మైన గాయత్రీమంత్రముయొక్క కర్త క్షత్రియుఁడైన విశ్వామిత్రుఁడే కదా. అనేకబ్రాహ్మణులకు క్షత్రియులు బ్రహ్మవిద్యోపదేశము జేసి రని యుపనిషత్తులలోఁ గనఁబడుచున్నది. అట్టియెడ క్షత్రియుఁడు రాజునకు గురు వౌటలో నసంభవము గాని యాశ్చర్యము గాని కనఁబడదు. రాజశేఖరునిభార్య యవంతిసుందరి గొప్పవిద్వాంసురా లని లోకమునఁ బ్రసిద్ధి గలదు. అలంకారశాస్త్రమందుఁగూడ నవంతిసుందరీమత మని యొక ప్రత్యేకసిద్ధాంతము గలదు. ఈమెప్రేరణముచేతనే భర్త రచించినకర్పూరమంజరీనాటకము ప్రయోగింపఁ బడిన దని యాగ్రంథప్రస్తావనలో నున్నది.

రాజశేఖరకవియొక్క కాల మిదమిత్థ మని నిర్ణయించుటకుఁ దగినయాధారములు లేవు. మాధవవిద్యారణ్యవిరచిత మని చెప్పఁబడుచున్న శంకరవిజయములో నొకరాజశేఖరుఁడు పేర్కొనఁబడి యున్నాఁడు. అతఁడు కేరళదేశాధిపతి యనియు, శారీరకమీమాంస మొదలగు వేదాంతగ్రంథములు రచియించి, యద్వైతమతస్థాపనాచార్యుఁ డైన శ్రీశంకరాచార్యుల సమకాలీనుఁడనియు, మహాత్ములైన శ్రీశంకరాచార్యుల దర్శనము చేసి, యారాజు వారిని గౌరవించె ననియు, నారాజు మూఁడు నాటకములు రచియించె ననియు, 'నీనాటకములు ప్రసిద్ధికెక్కుచున్నవా' యని యాచార్యులవారా రాజు నడిగిరనియు, శంకరవిజయములో నక్కడక్కడ సందర్భవశముగాఁ జెప్పఁబడియున్నది. మొట్టమొదట శంకరవిజయమును మాధవవిద్యారణ్యులు రచింపలేదు. నవకాళిదాసబిరుదాంకితుఁ డగు మఱి

యొక మాధవకవి దానిని రచియించినట్లు సంస్కృతవాఙ్మయశోధకుఁ
లగు విద్వాంసులు కొందఱ అభిప్రాయపడుచున్నారు. అది గాక శంకర
విజయము భోజప్రబంధమువలెనే కాలనిర్ణయవిషయమునఁ బ్రమాణ
ము గా దని చరిత్రశోధకుల యభిప్రాయము. ఇది గాక, శంకరవిజ
యములోఁ బేర్కొనఁబడిన రాజశేఖరుఁడు రచించిన నాటకములపే
ళ్లా గ్రంథమున నుదాహరింపఁబడలేదు. కావున నందుఁ బేర్కొనఁబడిన
రాజశేఖరుఁడు మఱియొకఁడు గాని, యీ రాజశేఖరుఁడు గాఁ డని
నిశ్చయింప వలసియున్నది. రాజశేఖరుఁడు తన బాలభారతమునందు,
బాలరామాయణమునందు, మహోదయ మనుపట్టణమును బేర్కొని
మహేంద్రపాలదేవునకుఁ దాను గురువునని చెప్పుకొన్నాఁడు. మహో
దయపట్టణమనఁగా కన్యాకుబ్జపట్టణమే. ఎట్లన కన్యాకుబ్జము, మహో
దయము, కాన్యకుబ్జము, గాధిపురము, కౌశము, కుశస్థలము ననుబేళ్లు
మహోదయపట్టణమునకే నామాంతరములని హైమనామమాల
విశ్వప్రకాశ మేదినీకోశములు చెప్పుచున్నవి. కాఁబట్టి మహోదయ
పట్టణమునందే రాజశేఖరకవి యుండె నని స్పష్టమగుచున్నది. మహో
దయపట్టణాధీశ్వరుఁ డైన మహేంద్రపాలదేవుఁ డను రాజుయొక్క దాన
శాసన మొకటి గూడ మున్నొకసారి ప్రకటింపఁ బడినది. మహేంద్ర
పాలదేవుఁ డాశాసనమును హర్షశకము 155 సం॥రమునఁ జేసినట్లు
గొందఱు వ్రాసిరి. హర్షశకము క్రీస్తుశకము 606 సం॥రమునఁ బ్రా
రంభింపఁబడినది. అందుచేత నాశాసనము క్రీ. శ. 761 సం॥రమున
రచియింపఁబడినదని నిశ్చయింపవచ్చును. మహేంద్రపాలదేవుఁడు క్రీ.శ.
760 సం॥ర ప్రాంతమున నున్న పక్షమున వానియాస్థానకవి యగు
రాజశేఖరుఁడు గూడ 8-వశతాబ్దమధ్యమున నున్న ట్లూహింప

వచ్చును. కాని, మ॥ కృష్ణగోపాల్ భండార్కరు పండితుఁడు రాజశేఖరుఁడు క్రీ. శ. 10 శతాబ్దమున నుండినవాఁ డని వ్రాసెను. 12-వ శతాబ్దమువాఁ డని మేక్డనాల్డుపండితుఁడు లిఖించెను. 14-వశతాబ్దమువాఁ డని మోతీమూలరు పండితుఁడు వ్రాసెను. ఈ యభిప్రాయభేదములచేత రాజశేఖరుఁ డేశతాబ్దమువాఁడో నిర్ణయించుట కష్టముగా నున్నది. కన్యాకుబ్జపరిపాలకు లైన హర్షవర్ధన యశోవర్మప్రముఖ మహారాజులు బాణభవభూతిప్రముఖ మహాకవుల నాదరించినట్లే మహేంద్రపాలదేవుఁడు గూడ రాజశేఖరకవి కాశ్రయుఁడై యుండె నని చెప్పుట కెట్టిసందేహము లేదు.

# విజ్ఞాపనము.

సంస్కృతభాషలో నున్న నాటకము లన్నింటిని నేఁటికాలపు టాంధ్రమహాకవు లాంధ్రీకరించి యున్నారు. క్రొత్తనాటకము లభింపకపోవుటచే నొక్కనాటకమునే మువ్వురు నలుగు రైదుగురు గూడ తెనిఁగించి యున్నారు. ఈవఱ కెవ్వరు భాషాంతరీకరణము చేయని రూపక మొక్కటి తెనిఁగింప వలయునని నాకోరిక. అందుచేత రాజశేఖరమహాకవికృత మైనకర్పూరమంజరీసట్టక మనాంధ్రీకృత మని విని యది ప్రాకృతభాషలో నుండుటచే దాని సంస్కృతఛాయ ననుసరించి తెలుఁగునకు మార్చితిని. రచన నావంతు; గుణదోషవిచారణము విద్వజ్జనములవంతు. ఆఁడుదానను. కించిజ్ఞురాలను. విశేషలోకానుభవము లేనిదానను. ఐనను గవిత్వమునందుఁ గొండొకపరిచయము గలదు గావున నేదేని యొక గ్రంథము రచియింపవలె నను నుబలాటముచే దీనిని రచించితిని. సహృదయులు గుణములు రాజశేఖరమహాకవి వనియు, దోషములు నావనియు గ్రహించి కృపాళువులై దోసముల నెఱిఁగించి న న్ననుగ్రహింతురు గాక యని వేఁడుకొనుచున్నాను.

రాజమహేంద్రవరము,
17—6—35

ఇట్లు,
విద్వజ్జన విధేయురాలు,
రావూరి వేంకటసుబ్బమ్మ.

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

—: పురుషులు :—

చండపాలుఁడు:—రాజు

కపింజలుఁడు:—విదూషకుఁడు

భైరవానందుఁడు:—పరివ్రాజకుఁడు

1. కాంచనచండుఁడు
2. రత్నచండుఁడు
3. కనకచండుఁడు
4. మాణిక్యచండుఁడు

} వైతాళికులు.

—: స్త్రీలు :—

విభ్రమలేఖ:—రాణి.

కర్పూరమంజరి:—కుంతలరాజపుత్రి, నాయిక.

విచక్షణ:—దేవిసహచరురాలు.

కురంగిక
సారంగిక

} పరిచారికలు.

శ్రీరస్తు.

# కర్పూరమంజరి.

ప్రథమజవనికాంతరము

(నాంది)

మ. పలుకుంబోటికి భద్రమౌముదము తద్వ్యాసాదులౌ సత్కవీం
ద్రులు గాంచం దగు నెల్లసత్కవులయందున్ వాణి వర్తింపఁ గా
వలె నాకున్ స్ఫురియించు మాగధియు నావైదర్భి పాంచాలి యిం
దలిసారంబు బుధుల్ చకోరములు జ్యోత్స్నం బోలెఁ గ్రోలందగున్.

మఱియు,

తే. గీ. కలితములు గాని పరిరంభవిలసనములు
మొలకలెత్తని చుంబనమోదములును
గణనసేయనిఘనతాడనములు గలుగు
నతనురతిమోహనములకు నతు లొసఁగుఁడు.

వెండియు:

తే. గీ. పూపచందురుఁ డెవరికి బొమిడికంబొ
ప్రియము సేయుదు రెవరికి వేల్పుగములు
మోహనాశయుక్తము లేరిమూర్తు; లట్టి
యీశగిరిజలకలయిక లేలు మిమ్ము.

మఱియు,

ఉ. ఈసును రోసమున్ గలుగునింతికి నై శశిరాప్యశుక్తిలోఁ
బోసినగాంగపూరములు పున్నమవెన్నెల ముత్తియంబులున్
దోసిలి వట్టి గౌరికి నతుండయి యర్ఘ్యము నిచ్చి మ్రొక్కు కై
లాసగిరీశుఁ డిచ్చు నకలంకజయంబుఁ జిరాయురున్నతుల్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్ర—(తెరవంక జూచి) ఏమిది! మాకుశీలవపరిజనము నేఁ డేదోరూపకము బ్రదర్శించుచున్నట్లు తోఁచుచున్నది. ఒకయువతి రంగులను సిద్ధముచేయుచున్నది. మఱియొక కాంత పువ్వులదండలు గ్రుచ్చుచున్నది. వేఱొకయంగన, పాత్రధారులకుఁ గావలసిన శిరోవేష్టనములను సేకరించుచున్నది. ఇంకొకరమణి వస్త్రములకు రంగులు పూయుచున్నది. అదిగో! వేణుగానము వినవచ్చుచున్నది. ఆవంక వీణావాద్య మారంభ మైనది. మూఁడుమద్దెళ్ళధ్వనులు వినఁబడుచున్నవి. ధృవాగీత మాలాపన చేయఁబడుచున్నది. ఇం దెవరి నైన నీవిషయము నడిగి తెలిసికొనఁగలను. (అని తెరవంకఁజూచి) ఎవ రక్కడ?

[అప్పుడు పారిపార్శ్వకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పారి—బావా! ఏమియాజ్ఞ?

సూత్ర—మీ రేదియో రూపకము ప్రదర్శింప నుద్యుక్తులై న ట్లున్నారే.

పారి—బావ! ఇప్పుడు మేము సట్టకము బ్రదర్శింపఁ బూనుచుంటిమి.

సూత్ర—దానిని రచించినకవి యెవరు?

పారి—

తే. గీ. బావ! నుడివెద యూహింపు మీవె యతని
రఘుకులీనచూడామణి ప్రథితకీర్తి

యగుమహేంద్రపాలునిగురు వైనఘనుఁడు
యామినీవల్లభశిఖండుఁ డనఘుఁ డతఁడు.

సూత్ర—(ఆలోచించి తనలో) నే నడిగినప్రశ్న కిది యుత్త రము గాఁబోలును. రాజశేఖరుఁడా? (ప్రకాశముగ) రాజశేఖరుఁడా?

పారి—అతఁడే యీయాకృతికర్త.

సూత్ర—సట్టక మనఁగా నేమి?

పారి—ఇట్లు విదగ్ధులచేఁ జెప్పఁబడినది.

తే. గీ. సాటకంబు దూరము గాదు నాటికకును
నైన భేదంబు లొకకొన్ని గానఁబడెడు,
కాన మీసట్టకమున విష్కంభములు ప్ర
వేశకంబులు, నింతియే భేద మరయ.

సూత్ర—కవి సంస్కృతభాషను విడిచి ప్రాకృతభాషలో నీకృతిని రచింపఁ గారణమేమి?

పారి.—సర్వభాషాచతురుఁ డైనయాకవిశేఖరుఁడు రాజశేఖ రుఁడే యిట్లు చెప్పియున్నాఁడు.

తే. గీ. బాస యేదైన నగుఁగాక పదము లవియె
భావములు నవె పరిణామభక్కియందుఁ
బలుకువిన్నాణమే యుండవలయుఁ గాక
కవివరు లన్నది మెచ్చుసత్కావ్యములకు.

మఱియు,

గీ. పరుసములు సంస్కృతంబునఁ బదరచనలు
కోమలంబులు ప్రాకృతగుంఫనములు
పురుషులకు పువ్వుఁబోండ్లకుఁ బోలె నుండుఁ
దారతమ్యంబు నెంచఁ దద్రచనలందు,

సూత్ర—కవి తన్ను గుఱించి యేమియుఁ జెప్పియుండలే దేమి?

పారి—అవధరింపుఁడు! అతనిసమకాలికుఁడును, మృగాంకలేఖాకథాకారకుఁడును నగునపరాజితుఁ డనుకవి రాజశేఖరునిగూర్చి యిట్లు చెప్పియున్నాఁడు.

తే. బాలకవియును, కవిరాజు, పావనుండు
గురువరేణ్యుండు నిర్భయక్షోణిపతికి
నిట్టిగుణపరంపరలచే నెన్నిక గని
యతఁడు కరము మాహాత్మ్యంబునధిగమించె.

మఱియు,

తే. గీ. సదమలము లయి యెవ్వానిసద్గుణంబు
లక్కళంకినిఁ జంద్రుని ధిక్కరించి
ధవళముగఁ జేయునో జగత్త్రయము, నట్టి
రాజశేఖరుఁ డీకృతి రాజకర్త.

సూత్ర—ఎవరియానతిచే మీ రిది ప్రయోగించుచున్నారు?

పారి—

ఆ. వె. చాహువానవంశజాతశిరోమాల
రాజశేఖరకవిరాజగృహిణి
సుగుణమణి యవంతిసుందరి యిట ప్రయో
గింపు మనియె భర్తృకృతిని నేఁడు.

ఆ. వె. చండపాలనృపతిచంద్రుండు దాచక్ర
వర్తిపదవిఁ గోరి పరిణయ మగు
నతిరసప్రవాహ మైనయీసట్టక
మందుఁ గుంతలేంద్రనను(ఁ)గుసుతను.

బావా! రమ్ము పోవుదము. తరువాతవని చూచుకొందము. మహారాజదేవేరుల వేషములు దాల్చి యార్యుఁడును, నార్యుని భార్యయుఁ దెరచాటున నిల్చియుండిరి.

(నిష్క్రమించుచున్నారు.)

[రాజు, రాణి, విదూషకుఁడు, తగుపరివారముతోఁ బ్రవేశించి పీఠములపైఁ గూరుచుందురు.]

రాజు—దేవీ! దక్షిణాపథనరేంద్రనందినీ! యీవసంతారంభమున నీవు మిక్కిలి శోభించుచున్నావు.

తే. గీ. అలరుగెమ్మోవి లత్తుక నలఁద లేదు
కమ్మకమ్మనినూనియల్ కదియ రాసి
దువ్వకొనలేదు తల నీవు తోయజాక్షి!
తొడుగుకొనలేదు రవిక మే నడుకుచుంట.

తే. గీ. అంబుజానన! కుంకుమమందుఁ గూడఁ
గడుననాదరభావంబు గలిగి యుంట
శిశిరరాజును బలిమి నిర్జించి మించి
యామనిదొర విజృంభించినట్లు తోఁచు.

దేవి—దేవా! నేనుఁ గూడ నీవసంతాగమముఁ బ్రశంసింతును.

తే. గీ. మెఱసె దంతరత్నంబులు మిహిక యడఁగ
మంచిగందపుంబూఁతపై మనసువాఱె
నిండ్లఁ బడకలు మాని వాకిండ్లయందు
ముసుఁగు లిడి దంపతులు నిద్రవోదు రిపుడు.

(తెరలో)

1. వైతాలికుడు—పూర్వదిగంగనాభుజంగ! చంపాచంపకకర్ణపూర! లీలానిర్జితరాఢాదేశ! విక్రమాక్రాంతకామరూప! హరికేలీకేలి

కారక! అవమానితజాత్యసువర్ణవర్ణ! సర్వాంగసుందరత్వరమణీయ!
నీ కీసురభిసమారంభము సుఖము నిచ్చుఁగాక! ఇక్కడ,

సీ. పాండ్యాంగనాగండఫలకముల్ పులకించు
సరణిఁ జంచలములై సంచరించి
కాంచీవిషయబాలికారత్నములలజ్జ
ఖండించి రెండుముక్కలుగఁ జేసి
లోలచోళాంగనాజాలంబునకుఁ గామ
కేళీసముత్కంఠఁ గీలుకొలిపి
కర్ణాటభామినీకమనీయకుంతలా
గ్రంబులు మెలమెల్లఁ గదలఁ జేసి
తే. గీ. చారుకుంతలకామినీసంతతులకు
మగలఁ గవయంగ నెంతేని మరులుకొల్పి
మలయగిరినుండి యరుదెంచుమారుతములు
చల్లచల్లఁగ వీచు నీసమయమందు.

(మరలఁ దెరలో)

2 వైతాలికుఁడు —

మ. అమరున్ గుంకుమపంకలిప్త మగుమాహారాష్ట్రకాంతాకపో
లమటుల్ సంపఁగిమల్లికాప్రతతిపాలంబోలు సంఫుల్లపు
ష్పములన్ భాసిలు క్రింద నల్పువు బయిన్ సారంగముం గల్గి యం
దమగున్ మోదుగుబంభరద్వితయపీతం బైనచందంబునన్.

రాజు — ప్రియురాలా! విభ్రమలేఖా! నే నొకవిషయమును
వర్ణింప నీవు నాకు వేఱొకవిషయము వర్ణించితివి. మనయిరువురను
గాంచనచండ రత్నచండు లనువైతాలికులు ప్రశంసించిరి. తరుణు
లకు విభ్రమజనకమై మలయమారుతముచే నూఁగుచున్నలత లనెడు

నాట్యకత్తెలకు నృత్యము సమకూర్చునదియుఁ, గోయిలకులాంగనలకంఠమున మధురమగు పంచమారావమును బ్రసరింపఁ జేయునదియు, మొలకలెత్తుమదనునిచెఱకువింటిచే నపహారితోగ్రము గల్గినదియుఁ, బంటపొలంతి కాప్తబంధు వైనదియు నైనయీమధుమాసమును దేవీ! నీ వెడదకన్నులతోఁ జక్కఁగాఁ దిలకింపుము.

దేవి—వందులు నుడివిన దెల్ల యథార్థమే గదా! మలయపవనములు విసరుచునే యున్నవి.

సీ. కదలంగఁ జేసె లంకాపురీతోరణ
మాలికాసంతతి మాటిమాటి
కలకుంభసంభవునాశ్రమంబునను జం
దనలతాకుంజములను జరించి
కర్పూరతరువల్లికానికాయంబును
నొయ్యన నుయ్యాల లూఁచి యూఁచి
కంపింపఁగాఁ జేసి కంకేళికులముల
నాట్యంబు లాడించి నాగవల్లిఁ
తే. దామ్రపర్ణీజలంబులఁ దనివి దీరఁ
జుంబనము జేసి వేమాఱుఁ జొక్కి చొక్కి
చైత్రవాయువుల్ వీచెఁ బ్రచండలీలఁ
జూచితే యెల్లదిశలను క్షోణినాథ!

మఱియు,

చ. విడువుఁడు మానముల్ ప్రియులఁ బ్రేమపుఁజూపుల గారవింపుఁడీ
కడు వడిఁ బోవు నిల్వ దధికంబుగ జవ్వన మట్లు గావునన్
దడయకుఁ డంచుఁ గోకిలనినాదముల న్ననవింటిజోదు నే
ర్పడరఁగ నానతిచ్చినటు లయ్యె వసంతమహోత్సవం బిలన్.

విదూష—మీయందఱ కంటెను నే నొక్కఁడనే పండితుఁడను. ఏలయన మామామగారిమామగారు పండితులయిండ్లలోఁ బుస్తకములు తెగ మోసియున్నారు.

చేటి—అందుచేతనే గాఁబోలును వంశపరంపరగా మీ కింత పాండిత్య మలవడినది.

విదూ—ఓసి తొత్తుకూఁతురా! కుట్టినీ! అవలక్షణములు గలదానా! తెలివితక్కువదానా! సిగ్గుమాలినదానా! అవిచక్షణా! నీవు గూడఁ బరిహాసము చేయఁదగినంతమూర్ఖుఁడ నైతినా? ఓసీ, మిండకత్తియా! తిరుగుఁబోతా! దుర్గుణరాశీ! వ్యర్థప్రలాపినీ! రథ్యాలుంఠినీ! దుశ్శీలా! ముంజేతికంకణమున కద్ద మెందులకే?

చేటి—సరె! అది యటుండనిమ్ము. గుట్టుపువరువున కద్దులేనట్లే నీనోటికి నడ్డు లేదు. ఇఁక నీవసంతఋతువును వర్ణింపుము.

విదూ—నీవు మాత్రము పంజరమునందున్న గోరువంకపిట్టవలె 'కురుకురు' మనుచుఁ బలుకుచున్నావు. నీ కేమియుఁ దెలియదు. కస్తూరి కుగ్రామమునందును, వనమునందును విక్రయింపఁ బడదు. గీటురాయి లేక బంగారమునాణెము తెలియదు. అట్లే నేను బ్రియవయస్యుఁడును, దేవియు నున్నయెడకుఁ బోయి వర్ణింతును.

రాజు—చెలికాఁడా! ఏదీ, వర్ణింపుము. సావధానుఁడ నైయున్నాను.

విదూ—

క. కలమాన్నముఁ బోలినపూ
వులుగల యాసిందువారభూరుహతతులుం
జిలికిన గేదెపెరుఁగువలె
వెలసెడు నామల్లెపూలు ప్రియములు నాకున్.

విచక్షణ—నీవర్ణనము నీభార్యకు మాత్రము సంతోషముగా నుండును. నీబుద్ధికిఁ దగినట్లు జెప్పితివి.

విదూ—సరే! ఉదారవచనపు నీవు వర్ణింపుము.

దేవి—సఖీ, విచక్షణా! మాయెదుర నీవు గొప్పకవయిత్రివైతివి. కావున గరువతనము గలదానవైతివి. ఈమహారాజునెదుట నీవు రచించినకావ్యమును జదువుము. సభలోఁ జదివినదే కావ్యము. గీటురాయినాణెమునకు నిల్చినదే బంగారము. పతిని రంజింపఁజేసినదే భార్య. కులదీపకుఁడే పుత్త్రుఁడు.

విచ—దేవి! చిత్తము. అట్లే చదివెదను.

సీ. వరుసలంకాపురీగిరినితంబములందుఁ
గరము దొట్రిలుచును దిరిగి తిరిగి
పతులతో విహరించి బడలినయానాగ
కన్యకావళిఫణాగ్రములతోడఁ
గబళనంబొనరింప గాసిలి యొంతయుఁ
గడు పేదలై కొంతతడవు నిలిచి
విరహిణీజనముల వేఁడినిట్టూర్పుల
మలయమారుతములు మగుడఁ బుట్టె
తే. శైశవావస్థనుండియు సత్వరముగఁ
బ్రబలతారుణ్యభావంబు బడసినట్లుఁ
గానవచ్చుచునున్న వీకాలమందు
మిగులసౌఖ్యంబు లొడఁగూర్చి మేనులకును.

రాజు—విచక్షణ చతురోక్తులందు నిజముగా విచక్షణయే. కవులకుఁగూడ కవి. మఱేమి గావలయును?

దేవి—ఈమె కవిశిరోరత్నమై యున్నది.

విదూ—(కోపముతో) దేవి సరిగాఁ జెప్పలేదు. 'విచక్షణ కవిత్వమునం దుత్తమురాలు. కపింజలబ్రాహ్మణుఁ డధముఁడు.' అని చెప్పిన బాగుండును.

విచక్ష—అయ్యా! కోపింపకుము. కావ్యమే కవిత్వమును బ్రకటించును. స్వోదరపూరణమునందును నిజకాంతారంజనమునందు ను నీపలుకు లమోఘములు. స్థూలశరీరముగలదానికిఁ గంచుకమట్లు ను, ముదుసలిదానికిఁ గటాక్షవిక్షేపములు వలెను, బోడితలకు బొడ్డు మల్లెలదండవలెను, గ్రుడ్డిదానికిఁ గాటుకరేఖవలెను నింద్యమైనవిషయ మున నీవు చేసినవర్ణనము రమణీయముగ లేదు.

విదూ—నీవుఁగూడ రమణీయమైనవిషయమున సుందరమైన శబ్దముల వాడియుండలేదు. బంగరుమొలనూలి కినుపగజ్జెలు కట్టిన ట్లును, పట్టుగుడ్డకు జనుపనారతో సరిగపని చేసినట్లును, తెల్లనిమేనుగ లదానికి మంచిగందము బూసినట్లును నీమాటలు రసహీనములై యున్నవి. అయినను నీవు పొగడొందుచున్నావు.

విచక్ష—అయ్యా! ఆగ్రహింపఁకుడు. మీతో మాకు స్పర్థ యేల? నీవు నిరక్షరకుక్షివైనను రాజాశ్రయముచే శోభిల్లుచున్నావు. నేను పండితురాలనైనను నాకు బేరుప్రతిష్ఠలు లేకున్నవి.

విదూ—నీవిట్లు ప్రేలుచుంటివి గనుక యుధిష్ఠిరునిజ్యేష్ఠభ్రాత పేరుగల నీయవయవములను రెంటిని బెల్లగించివైతును.

విచ—నేను నుత్తరఫల్గునితరువాత నుండు నక్షత్రము పేరుగల నీయంగములను ఖండింతును.

రాజు—వయస్య! అట్లనకుము. ఈమె చక్కనికవనము జెప్పుచున్నది.

విదూ—(కోపముతో) చెలికాఁడా! నీ వంత సరిగాఁ జెప్ప

లేదు. మాచేటిక హరిచంద్ర, నందిచంద్ర, కోటిశ, హాలప్రభృతుల ముందుఁ గూడ సుకవి యని చెప్పిన బాగుండును.

రాజు—అది యట్టిదే.

విచక్ష—నేను చిన్నప్పుడు కట్టివిడచిన లంగా యున్నచోటికిఁ బొమ్ము.

విదూ—(మెడ త్రిప్పి) మాతల్లికి మొదట యూడిపడిపోయిన దంతము లున్నచోటికిం బొమ్ము. చేటిక బ్రాహ్మణునితో సమానముగా స్పర్థవహింపఁ జూచిన రాజకులమునకు భద్రమగును గాక! ఇచ్చట మాయునికి కల్లు, పంచగవ్యము నొక్కకుండలోనే యుంచినట్లును, గాజురాయియు మాణిక్యమును నొక్కనగలోనే కూర్చినట్లును నున్నది.

విచ—భగవానుఁడు శంకరుఁడు తల ధరించునట్టిది రాజగృహమునం దిప్పుడు నీమెడమీఁదఁ బ్రయోగింపఁబడును. అశోకవృక్షమున కేది దోహదమో యది నీమొగమునఁ బడుఁగాక!

విదూ—మహాబ్రాహ్మణుఁడ నైనన న్నిట్లనుచున్నావు కనుక ఫాల్గునమాసమున జనులు పొందుశోభాంజనమును (బూడిద) పామరులెల్లకుఁగట్టుముక్కు త్రాడులను నీవు పొందుదువు గాక!

విచ—ఇట్లు వ్యర్థప్రలాపము లాడుచున్నందులకు నేను నీకుఁ దగిన ట్లుందెలకాలితో నీమొగము వగులఁదన్నుదును.

విదూ—(కోపముతోఁ గొంచెమునడిచి తెరచాటున నుండి కొంచెము బిగ్గరగా) దాసి బ్రాహ్మణునితో సమానముగ స్పర్థవహించి వాదించుచున్న యీరాజగృహమునకు దూరమునుండియే నమస్కరింపవలయును. ఈదినము మొదలుకొని వసుంధరానామధేయయు, బ్రాహ్మణియు నగునాయిల్లాలిపాదసేవ సేయుచు నింటియందే పడియుండెదను.

అందఱు—(నవ్వుచున్నారు.)

దేవి— ఆర్యపుత్రా! కపింజలబ్రాహ్మణుఁడు లేనిగోష్ఠియు నంజనములేని యలంకారశోభయు రాణింపవు.

(ఆకాశమున)

వలదు. వలదు. నేను రాను. నేను రాను. ఇంకొకప్రియమిత్రునిఁ జూచుకొనుము. వెదురుదొప్పలవంటిచెవులు గలిగినయీదుష్టదాసి నాస్థానమం దున్నవాని నపహసించును గాక! మీయందఱిలో నేనే చచ్చినవాఁడను. మీ రెల్లరు నూఱేండ్లు బ్రదికియుండుఁడు.

విచ—మీ రెవ్వ రాతని బ్రతిమాలవద్దు. ఈకపింజల బ్రాహ్మణుఁడు సరసుఁడు కాఁడు. ఈతఁడు బ్రతిమాలినకొలఁదిఁ దడిసిన నులకమంచమువలె బిఱ్ఱబిగుసుకొని పోవును. దర్శనీయమైన యీదృశ్యమును జూడుఁడు!

రాజు—

ఉ. పాడుచు గోపభామినులు పాదయుగంబున నూఁప నట్టు ని
ట్టూడెడుడోలికల్ గనుచు నవ్వనజాక్షుఁడు జాగు సేయుటన్
గోడిగ లన్నియున్ నడక కుంటువడన్ గని మెల్లగా రథం
బీడుచుకొంచుఁ బోవుటను నీదినముల్ పొడవయ్యె నిత్తఱిన్.

[విదూషకుఁడు ప్రక్కనుండి ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—ఆసనము. ఆసనము.

రాజు—ఎవరికి?

విదూ—భైరవానందుఁడు వచ్చియున్నాఁడు.

దేవి—జనులచే నద్భుతప్రజ్ఞాశాలి యని కొనియాడఁబడు నాతఁడేనా?

విదూ—అతఁడే!

రాజు—ప్రవేశపెట్టుము.

[విదూషకుఁడు నిష్క్రమించి భైరవానందునితోఁ
ప్రవేశించుచున్నాఁడు.]

భైరవా—(కొంచెము మద మభినయించి)

ఉ. మాకు గురుప్రసాదమున మంత్రముతంత్రము లేవి లేవు, బా
ధాకరమైన జ్ఞానమును ధ్యానము నన్నవి లేవు, హాయిగా
మాకులమార్గముల్ దగిలి మద్యము ద్రాఫి సుఖంతు స్త్రీలతోఁ
జేకురు నాకు మోక్షు; మది సిద్ధము; సంశయ మేది లే దిఁకన్.

మఱియు,

తే. గీ. తలఁపఁ జండి యూరండ నాధర్మపత్ని
మాంసమును మెక్కి త్రావెద మద్య మేను,
చర్మఖండంబు శయ్య, భోజ్యంబు భిక్ష
మెవ్వరికి కులధర్మంబు లింపు గావు.

వెండియు,

చ. హరియుఁ జతుర్ముఖాదిసుర లందఱుఁ బల్కుచునుండ్రు ముక్తి య
ధ్వరముల వేదపాఠముల ధ్యానములం గనవచ్చునం చుమే
శ్వరుఁ డొకఁ డట్లు గా దనుచుఁ జంపకగంధులతోడికూటముల్
సురుచిరమద్యపానమును సూటిగ ముక్తిసమంబు లా ననెన్.

రాజు—ఇదిగో! ఈయాసనమునఁ గూర్చుండుఁడు.

భైర—(కూర్చుండి) ఇప్పుడు నేను చేయవలసిన దేమి?

రాజు—ఏదైన నొక యద్భుతవిషయమును జూడఁగోరు
చున్నాను.

భైర—

తే. గీ. నేలమీఁదికి దింపెద నింగునెలను
నింగినడుమ సూర్యరథంబు నిల్పివైతుఁ

త్రుటిని సురసిద్ధకాంతలఁ దోడితెత్తు
నా కసాధ్యంబు గలదె యీలోకమందు.

కావున మీ కేదికావలయునో యవశ్య మెఱిఁగింపుఁడు?

రాజు—మిత్రుఁడా! నీ వెక్కడనైన నొకయపూర్వమైన మహిళారత్నమును జూచితివా?

విదూ—చూచియున్నాను.

రాజు—అది యతనికిఁ జెప్పుము.

విదూ—దక్షిణాపథమందు వైదర్భ మనుపేరుగల నగరమొకటి గలదు. అందు నే నొక కన్యారత్నమును గాంచితిని. ఆమె నిప్పుడిక్కడకు రప్పింపుము.

భైర—అట్లే రప్పించెదను.

రాజు—పూర్ణిమాహరిణాంకుని ధరణి కవతరింపఁ జేయుము.

భైర—(ధ్యానము నటించుచున్నాఁడు.)

[తెర త్రోసికొనికర్పూరమంజరి ప్రవేశించును. అందఱుఁ జూచుచున్నారు.]

రాజు—ఆహా! ఆశ్చర్య మాశ్చర్యము.

సీ. కడిగివైచినకాటుకలజాడలు గలిగి
యరుణరేఖల నొప్పునక్షియుగము
ముంగురులకొనలు ముసిరియుండుటచేత
ముద్దుగుల్కుచునున్న మోముదమ్మి
పాణిపల్లవమునఁ బట్టినకురులకొ
నలనుండి జాఱినజలకణములు
వీపుమీఁదికి జాఱి వ్రేలాడుచున్నది
యెంతో రమ్యముగఁ బయ్యెదచెఱంగు

తే. గీ. శూర! జలకేళి సవరించునట్టివేళ
నద్భుతరసంబు పుట్టించునట్టి యీమె
నిమ్మహాయోగి తోడ్తెచ్చె నిచ్చటకును
గనులపండువు మాకెల్లఁ గలుగఁ జేయ.

మఱియు,

చ. ఉరమునఁనుండి జాఱిపడుచుండెడిపయ్యెద నొక్కచేతఁ జె
చ్చెర సవరించి, యాజఘనసీమఁ జలించుచునున్నయట్టియం
బరము ద్వితీయహస్తమునఁ బట్టి హళాయల్ వెదజల్లునీమె యె
వ్వరి నిల వట్టిచిత్రములభాతిని జేయదు? సోయగంబునన్.

విదూ—

తే. గీ. స్నానమునకయి తనమేనినగల నూడ్చి
యలలదెబ్బల నవసినయంగయష్టి
యార్ద్రవస్త్రంబు తనులత కందమొసఁగ
రమణిదృష్టి సౌందర్యసర్వస్వ మౌర!

కర్ణా—(అందఱనుజూచి తనలో) గంభీరమధుర మైనశోభా సముదయముచే నొప్పుచున్న యీమహనీయమూర్తి మహారాజని తోఁచుచున్నది. ప్రక్కనున్నలలనామణి యాతనిదేవి యైయుండును. అర్ధనారీశ్వరుని గౌరి యనిచెప్పక యే చెప్పుచున్నది. వీరంద ఱాతనిపరిజనము. ఈమహారాజు సతితోఁ గూడియున్నను, నతనిదృష్టి నన్ను బహూకరించుచున్నది.

రాజు—(విదూషకునితో మెల్లగా)

ఉ. ఆరమణీకటాక్షనివహం బతితీవ్రముఁ జంచలంబు నై
తోరపుఁగేతకీదళపుఁదొన్ని యచాయల నొప్పి మేనఁ గ

ర్పూరరసంబు జిల్కినటు ముత్తియపుంబొడి మెత్తుపోలికన్
గూరిమి పండువెన్నెలలఁ గ్రుంకిడినట్లు ఘటించె సౌఖ్యమున్

విదూ—ఆహా! యేమి యీమెరూపరేఖ.

చ. పిడికిటఁ బట్టవచ్చుఁ బసిబిడ్డ లహో త్రివళీయుతంబు నె
న్నడుమును, రెండుచేతులను నాతినితంబముఁ బట్టఁజాల విా
పడఁతుకకన్నులం గొలువవచ్చును జేరలతోడ, నీమె నా
యెడఁదను నిట్టు లున్నదని యెన్నటకేనిఁ దరంబు గాదు సూ!

ఏమిా! స్నానముచేయుటచే మైపూతలు కరఁగిపోయినను, భూషణములు దీసివైచినను నీమె కడురమణీయముగ నున్నది.

కాక,

తే. గీ. రూపహీన లైనను గొంత రూపు గలిగి
వెలయుచుందురు భూషణవితతిచేత;
సహజసౌందర్యవంతులచక్కఁదనము
నవవికాసము జెందును నగలచేత.

రాజు—ఈమెనుజూడ నా కిట్లు దోఁచుచున్నది.

ఉ. మేలిమికుందనంపుఁబస మేన్ దళుకొత్తు కనుల్ వెండదలా
శ్రీలకుఁ జుట్టముల్ చెవులు, చెక్కులు రెండును జంద్రఖండముల్
బోలును జేఁత విల్లు గొని పూవిలుకాఁడు లతాంగిఁ బ్రోచినన్
సోలఁగఁ జేయు మాటికిని సూటిగఁ జిమ్మును మోహనాస్త్రముల్.

విదూ—అంగడివీథిలోనున్న రత్నమువలె నీమెశోభ సర్వజన రమణీయముగా నున్నది.

రాజు—వయస్యా! ఇటు వినుము.

చ. పడఁతుకమేను నైజగుణవర్గముచేతనె శోభగాంచు, మేల్
తొడవులు గప్పివేయుఁ జుమి తొయ్యలిచక్కఁదనంబు నెల్ల, నీ

వడువున నైజకాంతిగలపాటలగంధుల నిత్యభృత్యుఁ డై
వెడవిలుకాఁడు గొల్చుఁ దగ విల్లును నమ్ములు బూని చేతులన్.
మఱియు నీమెసౌందర్యము,

చ. నడు మది యెంతచిన్నదియొ నాతికటీస్థల మంత పెద్ద ద
య్యెడు, నుర మెంత యున్నతమొ యీసఖిపొక్కిలి యంతలోతుఁన
య్యెడుపతికాంతి యెంతటిదొ యుగ్మలియానన కాంతి యంత చొ
ప్పడు చెవికల్వ యెంత యలుపంబొ కనుంగవ యంత పెద్దదా.

దేవి—కపింజలా! యీమె యెవ్వరో తెలిసికొనుము.

విదూ—సుందరీ! నీ విట గూరుచుండి నీయుదంత మెఱింగింపుము.

రాజు—ఆమె కాసనము నమర్పుఁడు.

విదూ—ఇదిగో! నాయుత్తరీయమే యాసనము.

(ఉత్తరీయము పరువఁగా కర్పూరమంజరి కూర్చుండును.)

కర్పూ—కుంతలదేశమందు వైదర్భ మనునొకనగర ముండెను. ఆనగరమును సకలప్రజావల్లభుఁ డైన వల్లభరాజనునృపాలుఁడు పాలించుచుండును.

దేవి—(తనలో) అతఁడు నాపినతల్లిభర్తయే.

కర్పూ—శశిప్రభ యనునామె యాతేనియిల్లాలు

దేవి—(తనలో) ఆమె నాపినతల్లియే.

కర్పూ—వారు నాజననీజనకులు.

దేవి—శశిప్రభాగర్భమునఁ దక్క నిట్టిరూపరేఖావిలాసము లెక్కడనుండి వచ్చును! వైడూర్యశలాకలు విదూరభూమినిఁ గాక మఱెక్కడ బుట్టును! (కర్పూరమంజరితో) నీవు కర్పూరమంజరివా? రమ్మా. సోదరీ! న న్నాలింగనము జేసికొనుము.

కర్పూ—పూజ్యురాలా! కర్పూరమంజరి ప్రథమప్రణామ మిదె.

దేవి—అయ్యా, భైరవానంద! నీయనుగ్రహముచేఁ గర్పూర మంజరీసందర్శన మనునపూర్వసంవిధానక మనుభవించితిని. ఈమె యిక్కడఁ బదునై దుదినము లుండినతరువాత మరల నీవెను బంప వచ్చును.

భైర—చిత్తము. మీయాజ్ఞాప్రకార మట్లే చేసెదను.

విదూ—(రాజుతో) మిత్రమా! ఇక్కడ మన మిరువురమే [illegible] కాని, వీ రందఱు నొక్కటే. వా రిద్ద ఱక్కసెల్లెండ్రు [illegible] భైరవానందుఁడు వారికూడికకుఁ గారణమై వారిచేత మన్నన [illegible]వాఁడే. ఇంక నీయుపరసరస్వతిశరీరము వే అన్నమాటయే గాని దేవిగారే!

దేవి—విచక్షణా! జ్యేష్ఠసోదరియైన సులక్షణతోఁ జెప్పి భైరవానందునకు మెచ్చువచ్చుసపర్యలఁ గావింపుమని చెప్పుము.

విచ—దేవీ! మహాప్రసాదము. అట్లే చేయుదును.

దేవి—ఆర్యపుత్రా! నాకు సెలవిచ్చి పంపుము. ఈస్థితియందున్ననాచెల్లెలి నలంకరింపఁ బోయెదను.

రాజు—చక్కగా నున్నది. సంపంగితీఁగపాదు కస్తూరీకర్పూరములచే నిండింపఁ బడును.

ప్ర॥ వైతాళికుఁడు—దేవరవారి కీసాయంసంధ్య సుఖము నిచ్చుఁగాక!

ఉ. వాసరజీవపిండ మయి భాసిలుచుండెడుభానుమండలం
బీసమయంబునం దెటకో యేగెడుఁ, బ్రాణవిభుండు వోవ సం
త్రాసముఁ జెంది, తద్విరహతాపమునన్ వెస మూర్ఛవోయి, క
న్మూసెనొ తమ్మితీవ యనఁ బొల్పు దొరంగి మొగిడ్చెఁ బద్మముల్.

ద్వి॥ వైతాళికుఁడు—

సీ. మురువైన రతనాలముంజూర్ల గమితోడ
భిత్తికాప్రతతితో వెలయునిండ్లు
పరిచారికలు పూలపాన్పుల సమకూర్చి
రామని కనువైనయట్టిలీల
సైరంధ్రు లంగుళీచలనంబులను మృదం
గములను వాయింపఁ గడఁగి రిపుడు
మగలపై నలిగినమగువలమధురహుం
కారముల్ సెలఁగె నగారములను

తే. గీ. కడువిరాళిచే మగలరాకలను గోరు
సతులయూర్పులు శ్రవణగోచరము లయ్యెఁ
జందమామను గనుఁగొని సంతసమునఁ
గలువపువ్వులు నవ్వెడిఁ గొలఁకులందు.

రాజు—మనము గూడ సంధ్య నుపాసించుటకై పోవుదము.

మొదటి తెర.

శ్రీ ర స్తు.

# కర్పూరమంజరి.

## ద్వితీయజవనికాంతరము

[రాజును, ప్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు.]

ప్రతీ—(పరిక్రమించి) మహారాజా! ఇక్కడ, ఇక్కడ.

రాజు—(కొన్నియడుగులు నడిచి, యామె నుద్దేశించి) ఇప్పుడు,

చ. అనయము నన్ను నీమె మది ధ్యానము చేయుట నాల్గుభంగు ల
య్యెను దను వానితంబము జలింపదు సూ తిలమాత్ర మైనఁ గా
మిని మెడ వక్రమయ్యె జడ మిక్కిలి సొంపుగఁ జుట్టివచ్చె మో
ము నుబడె వక్షమం దుదరముక్ విలసిల్లు చలద్వళిత్రయిన్.

ప్రతీ—(తనలో) ఏమీ! యిప్పుడు గూడ నాతాళీపత్రసంచయమే. ఆయక్షరపంక్తులే! నేను వసంతఋతువర్ణనమిషచే నీతనిహృదయావేగమును తగ్గించెదను. (ప్రకాశముగ) మహారాజా! కొంచెము కొంచెము గా ముదురుచున్న కుసుమాకరమును జూడుము.

తే. గీ. కోయిలలకంఠముద్రలఁ గోసివైచి
తేటిపాటలమధురిమ దీటుకొల్పి
విరహులకుఁ బంచమస్వరవిధము దెలిపి
దినము లీవసంతమునందు దీర్ఘము లగు.

రాజు—

సీ. అంతఃపురీవసత్కాంతావిలోచన
పత్రితతి కమేయలావణ్యవార్ధి
మానసరంజకమందహాసాదివి
లాససంతతులకు వాసనగరి
సకలసౌభాగ్యలక్షణముల సరిహద్దు
దృష్టికైరవముల దిగుడుబావి
ఆరయ నాకు శృంగారసంజీవిని
యలరువిల్కానికి నాయుధంబు

తే. గీ. నగుచు నలరారుచున్న యీయంబుజాక్షి
నిప్పు డాధారముగఁ జేసి యించువిల్తుఁ
డహహా! వింటిలో సమకూర్చి యలరుటమ్ము
లేయుచున్నాఁడు నామీఁద నేపు మీఱి.

(సోన్మాదముగా) చూచినక్షణమునుండియు నా కురంగాక్షి,

చ. మనమున లగ్నమైనయది మానవతీమణి తీసిపోవ దే
గోనముల, నెల్లదిక్కులను గోచరమయ్యెడు నామెరూపు, నా
కనయముఁ గావ్యబంధములయందును మాటలయందు ధ్యానమం
దును గనిపించుచున్నయది తోయజనేత్రి, యదేమి చిత్రమో!

మఱియు,

చ. వెలఁదుకతీవ్రచంచలసువీక్షణమందుఁ దిరిభాగ మేనిపై
నిలుచునొ, వాఁడు కామమధునీరజవైరులబారి కగ్గమై
పోలియును; వేనిపై నిలుపు బూర్ణముగాఁ దనదృష్టి, వానికిఁ
జెలఁలును జుట్టముల్ విడువఁ జెల్లుఁ దిలోదకముల్ విషణ్ణులై.

మఱియు,

తే. గీ. కలికికన్నులయెదుట భృంగములచాయ
క్వథితదుగ్ధతరంగపుంగాంతినడుమ
వెనుకఁ జేరిగంటిచూపులవిల్లు బూని
నారిఁ జెవియంట లాగిననవిలుతుఁడు.
ప్రియవయస్యుఁ డేటికో యాలస్యము చేయుచున్నాఁడు.

(తెరలో)

విదూ—ఓసీ! విచక్షణా! ఇది యంతయు యథార్థమేనా?

విచక్ష—అంతయు యథార్థతరము గూడను.

విదూ—నీవు పరిహాసమాడుస్వభావము గలదాన వైనందున నేను నమ్మఁజాలను.

విచక్ష—అయ్యా, అట్లనకుము. పరిహాసమాడుసమయము వేఱు కార్యాలోచనాసమయము వేఱు.

విదూ—నాప్రియమిత్రుఁడు మానసమును విడిచిపెట్టినరాయంచవిధమునను, మదస్రావము గలిగినయేనుంగువలెను, గ్రీష్మకాలమున వాడిపోయినతామరకాడచందమునను, కాంతిహీనమైన పగటిదీపమువలెను, నుదయకాలమునందలి పున్నమచందమామ భంగిని దెల్లనై కృశించి యున్నాఁడు.

(విదూ, విచ, ప్రవేశించుచున్నారు)

ఇద్దఱు—మహారాజునకు జయ మగుఁగాక!

రాజు—ఏమీ! నీవు మరల విచక్షణతోఁ గలసితివా?

విదూ—విచక్షణ నాతో సంధిచేసికొనుటకే వచ్చినది. ఈమెతో సంధిచేసికొనుటచేతనే యింతయాలస్య మైనది.

రాజు—సంధి చేసికొనుటవలనఁ బ్రయోజన మేమి?

విదూ—ఈవిచక్షణ యభిమతజనముచేఁ బంపఁబడి యిటకు వచ్చినది.

రాజు—(వాసనచూచుట నభినయించి) కేతకీకుసుమవాసన లెక్కడివి?

విచక్షు— కేతకీదళలేఖ యిదిగో నాచేత నున్నది.

రాజు—ఇది వసంతఋతువు గదా! ఈకాలమునఁ గేతకీపుష్పములు పూచునా?

విచక్షు—భైరవానందుని మంత్రప్రభావముచే దేవిగారియుద్యానవనమునఁ గేతకీలతకు నొక్కపూవు పూచినది. అందుఁ గొన్నిరేకులతో డోలికోత్సవసందర్భమున హారవల్లభను బూజించి రెండురేకలను జిన్నచెల్లెలు కర్పూరమంజరికిఁ బంపెను. ఆమెయు నొకరేకుతో గారిని బూజించి రెండవరేకును,

తే. గీ. వనిత కస్తూరికామషీవర్ణములను
వరలుగీతికాద్వయమును వ్రాసి యిపుడు
కేతకీదళసంపుటిఁ బ్రీతితోడఁ
గానుకగా నంపెఁ గైకొను తన్మాతలేంద్ర!

రాజు—(పుచ్చుకొని చదువుచున్నాఁడు.)

తే. గీ. పెంటియంచ కుంకుమపంకపింజరి తగఁ
జేసి యెవ్వరో విభుని వంచింప నతఁడు
చక్రవాకాంగన యటంచు సంశయించి
దాని మొగమైనఁ జూడక తరలి పోయె.

తే. గీ. కడనె యుండియు నీ వది గానలేక
మోసపోయితి వెంతయు ముగ్ధుఁడ వయి
పార్థివేంద్ర! యియ్యది నాదు పాపఫలము
అనుభవించితి దానికి నర్హ శిక్ష.

(రెండుమూఁడుసారులు చదివి) ఈయక్షరములు మదనరసాయనములు గదా!

నేను పద్యరూపముగా వ్రాసితిని. దేవరవా రదియును జదువఁ దగును.

రాజు —(చదువును.)

తే. గీ. నిడుద లయ్యె నూరుపు లహర్నిశలయట్లు,
మణివలయములతో బాష్పగణము జాఱె,
దేవి దేహవల్లికతోడ జీవితాశ
కార్శ్యతఁ వహించె, నీవియోగమున, రాజ!

విచ—ఇప్పుడే యీయవస్థయం దున్న యీమెచే ననుజ్ఞ వడసి మా జ్యేష్ఠసోదరి సులక్షణ యొకపద్యమును వ్రాసినది. దానిని దేవర చిత్తగింపుఁడు.

సీ. హారయష్టిసదృశ మైనచందనచర్చ
యింతియూరుపులఁ బేరెత్తుచుండెఁ
జలువలు వెదజల్లుజాబిల్లి చిచ్చయ్యె
మందహాసము నామె మరచి యుండె
విరహపాండిమమున విరిబోఁడిమైఁదీఁగ
దినశశికళశోభఁ దనరుచుండె
నిడుదకన్నులనుండి నిరతంబు ప్రవహించు
బాష్పముల్ పంటకాల్వలుగఁ బాఱె

తే. గీ. నీనిమిత్తమె కృశియించి నృపవరేణ్య!
నిన్నె తలఁచుచు నిశలందు నిదుర గనక
నిక్కముగఁ గుందుచుండెను నీరజాక్షి
యన్నిటను విముఖత జెంది యహరహంబు.

రాజు—ఎంత చక్కఁగాఁ జెప్పినది! నీజ్యేష్ఠసోదరియు గొప్పకవయిత్రియే యగును.

విదూ—ఈవిచక్షణ భూలోకసరస్వతి. ఈమెయక్కగారు త్రిభువనసరస్వతి. కానిండు! వీరలతో నాకేమిస్పర్థ? నామిత్రునియెదుట మదనావస్థను నాకుఁ దగినరీతిని వర్ణించెదను.

రాజు—మిత్రమా! చదువుము. దానినిఁగూడ వినియెదను.

విదూ—

చ. అతివకు గంధమున్ గరళమ ట్లగు వెన్నెల వేఁడియయ్యె సం
గత మగుగాయమం దిడినహారము లేవను హారముల్ మృణా
ళతతియుఁ దీవ్రబాణములలా గగు, వెచ్చఁగఁ దోఁచు మందమా
రుతములు, శీతలాంబువులఁ గ్రుంకిన నామెకు మేను మండెడున్.

రాజు—చెలికాఁడా! నీవును గొంచెము చందనరసముచే నలంకరింపఁబడిన ట్లున్నావే. జరిగినవృత్తాంతము నాకెఱింగింపుము. అంతిపురమునకుఁ బోయినయనంతరము దేవి యామె కేమిచేసెను?

విదూ—విచక్షణా! దేవి యేమి యొనర్చెనో నీవే క్రమముగాఁ దెల్పుము.

విచ—దేవా! దేవి యామెను మజ్జనమాడించి తిలకమిడి తొడవులు పెట్టించి తృప్తి పఱచెను.

రాజు—అవ్విధ మెట్టిదో స్పష్టముగాఁ జెప్పుము

విచక్ష—సీ. రమణికిఁ గుంకుమరసపింజరం బగు
చెలువున నెమ్మేన నలుగు లిడిరి

—— కాంచనమయబాలికారూప మద్దాన
మితిలేనికాంతితో మెఱుఁగు దీరె

విచక్ష—మరకతమయ మైనమంజీరయుగళంబు
నడుగులకును జెలుల్ దొడిగి రంత

రాజు — తలక్రిందు లై నట్టితమ్మిపూవు లటంచు
భ్రమసి చేరిన దేమొ భ్రమరయుగము

విచక్ష — తొయ్యలి రాచిల్కతోఁకవన్నియ గల్గు
మేల్పట్టుపుట్టముల్ మేనఁ దాల్చె

రాజు — కఱకుగాడ్పులచేతఁ గదలునగ్రిమదళం
బులు గలయనఁటినిఁబోలు లేమ

విచక్ష — పంచరాగమణులకాంచి నమర్చిరి
సీమంతినికిఁ గటిసీమయందు

రాజు — మేరుపర్వతశిలమీఁదను నెమిలిచే
నాట్యమాడించినననుపు దోఁచు

విచక్ష — తమ్మిపూవులవంటితరుణిముంజేతుల
మణికంకణమ్ము లమర్చి రంత

రాజు — పూవిలుకానియమ్ములపొది శోభిల్లు
సీక్రొత్తయలుఁ గందు నిమిడి యుంట

విచక్ష — కట్టాణిముత్యాల కమనీయహారంబు
మెడలోన వైచిరి మెలఁత కపుడు

రాజు — శీతాంశుమండలి సేవించుచున్నవి
చుక్క లన్నియు దానిచుట్టుఁ జేరి

విచక్ష — వెలఁదివీనులయందు వెలలేనిరతనాల
కుండలయుగళంబు గూర్పఁబడియె

రాజు — మగువనెమ్మోము మనుమన్మథరథమున
రెండుచక్రంబులరీతి నుండు

విచక్ష — మేలైనకాటుక మెలఁతలు పెట్టిరి
సోగకన్నులయందు సొబగు మీఱ

రాజు— నల్లగల్వలపేరినారాచములు రెండు
తలిరువిల్తుఁడు గూర్చెఁ దనదువింట

విచక్ష— కుటిలంబులైనముంగురులు నెన్నుదుటిపైఁ
బడునట్లు జడ యల్లెఁ బడఁతి కపుడు

రాజు— ఇందుమండలమందుఁ గృష్ణసారం బొందు
నిలిచినయందంబు నెగడు నపుడు

విచక్ష— చిరుగుఁబోణికి నంత చికురబంధంబునఁ
గుసుమగుచ్ఛంబులు గూర్పఁ బడియె

రాజు— చంద్రరాహువులకు సమకూరియున్నది
మల్లయుద్ధము కాంతమౌళియందు

విచక్ష— తే. ఈ తెఱంగున దేవి యథేచ్ఛముగను
బాలిక నలంకరించె నోపార్థివేంద్ర!

రాజు— అట్టు లగునేని కేళికోద్యానభూమి
ఘనవసంతసంపదచేతఁ గ్రాలు ననుము.

విదూ—దేవా! నేను దీనియందలిపరమార్థమును విన్నవించుచుంటిని.

చ. ధవళవిలోలనేత్రలకుఁ దద్ద మెఱుంగిడు కజ్జలంబు సొం
పవును విశాలవక్షమున కచ్ఛపుము త్తెపుఁబేర్లు శోభిలుఁ
సువిపులమౌకటిస్థలిని సుందరమౌ మొలనూలు నైన నీ
భువి నతిసుందరాంగులకు భూషణముల్ గడు దూషణంబు లౌ!

రాజు—

చ. తడిసినసన్నదువ్వలువ తామరసాక్షియురస్థలంబునన్
బెడఁగగుబాహుమూలములఁ బీననితంబమువిూఁద నందమై
ముడుతలు గానరానటులు మూయుచుఁ బొక్కిలి నంటియుండి యీ
పడఁతుకసోయగంబు నెలప్రాయము చెప్పకచెప్పుచుండెడిన్,

విదూ—(కోపముతో) ఓయీ! నేను సర్వాలంకారసహితను గా వర్ణించితిని. నీవు మాత్రము జలవిలుప్తప్రసాధనమునే స్మరించు చున్నావు. నీవు వినియుండలేదా?

తే. గీ. సహజసౌందర్యవంతులచక్కఁదనము
నాభరణకాంతిచేఁ గడు నతిశయిల్లు;
జాతిరత్నము లైనను స్వర్ణభూష
ణములఁ గూర్పంగ హెచ్చుఁ దద్విమలకాంతి.

రాజు—

తే. గీ. భూషణంబులఁ దాలిచి పువ్వుబోండ్లు
ముగ్ధహృదయముల్ హరియించి మోసగింత్రు;
తజ్ఞుఁ డెద మెచ్చు సహజసౌందర్యరేఖ,
పంచదార ద్రాక్షకుఁ దీఁపి నించునొక్కొ?

విచక్ష—దేవర యానతిచ్చినట్లే.

గీ. తద్దయు విశాలమైన నితంబమునకుఁ
గర్ణకలికల దాఁకెడుకన్నుఁగవకు
భూశశాంకమండలమైన ముఖమునకును
గాంతిరసమహానది యైనగాత్రమునకు
నెవ్వఁ డేమి యలంకార మీయఁ గలఁడు?
అఖిలలావణ్య మట రూఢ మైనకతన
సారతరమైనగుణ మున్న కారణమున
నందఱును దాని మెచ్చెద రాదరమున.

రాజు—కపింజల! నీవుగూడ జాణ వగుచున్నావే.

చ. లలనకుఁ గృత్రిమం బగునలంకృతి యేల నటీవిడంబనం
బులు సుమీ! యట్టి దాసహజభూరివిలాసమె శోభ దెచ్చుఁ గాం

తలకు నడఁభలభ్యసుగుణంబులఁ గూడినజవ్వనంబు వ
ర్తిలుతతి నేయలంకి9యలు స్త్రీలకుఁ గూర్పవు సోయగంబులన్

విచక్ష—దేవా! నేను కేవలము దేవిగారియాజ్ఞచేతనే కర్పూ రమంజరి ననుసరించుట లేదు. కర్పూరమంజరితోడిచెలిమి తారా మైతి9చేతనే పాి9ప్త మైనది. అందుచే నామెపనులయం దాసక్తి గలిగి యామెకు సేవకురాల నై మనవి సేయుచున్నాను.

మ. తనదేహస్థితి నారయక్ జెలు లెడందం జేతులర్ వైవ బ
ల్మినిఁ దాఁ దో9యును వారిహస్తముల,నామీఁదన్ వినక్ వింతయా
దన కానందము భీతి గొల్పునిశలం దా నెట్టెటో బుచ్చుఁ; జం
దు9నివెల్గుల్ దనచేతు లన్గొడుగులన్ దోడ్తో నివారించుచున్.

కార్యశేషమును గపింజలుఁ డెఱిఁగించును. దేవరవా రట్లు చేయఁదగును. (అని నిష్కృ9మించును.)

రాజు—వయస్యా! ఆకార్యశేష మేమి?

విదూ—నేఁడు హిందోలనచతుర్థి. డోలికామహోత్సవము కావున దేవి గారిని బూజించి, కర్పూరమంజరి నూయెలయందుంచి యానందించును. ఆసమయమున దేవరవారు మరకతపుంజపా9సాద మున నుండి డోలికయందున్నకర్పూరమంజరిని జూడఁ దగును. ఇదియే నేను జెప్పఁబోవుకార్యశేషము. ముసలిపిల్లి పా లనుకొని పెరుఁగు దా9వినట్లు దేవి మిక్కిలి నేర్పరియైనను నీవిషయమునఁ బొరపడినది, కావున మన కిది యనుకూలముగ నున్నది.

రాజు—నాకార్య మనుకూలపఱుచుటకు నీవు గాక వే ఱెవ్వ రున్నారు? చందు9డు దప్ప మఱెవ్వరు సముద9ము నుప్పొంగఁ జేయుదురు?

(అని నడచి కదళీగృహమును బ9వేశించుచున్నారు.)

విదూ—మిత్రమా, ఇదిగో! ఎత్తైనయీచలువరాతిన్నెపైఁ గూర్చుండుము.

రాజు—(అట్లు చేయుచున్నాఁడు.)

విదూ—(చేయెత్తి)ఓయీ! పూర్ణిమాసుధాకరునిఁ జూడుము.

రాజు—ఓయీ! డోలారూఢయైన నాప్రియసఖిని పూర్ణిమాసుధాకరుఁ డని నిర్దేశించితివా?

సీ. నగరసుందరులయాననమండలచ్ఛాయ
నాచ్ఛాదనము చేసి యాత్మకాంతి
విమలకాంతులపేరివెన్నెలనీటిచే
గగనగహ్వరమును గడిగివైచి
యీక్షించువారలహృదయమం దుండెడి
గరువతనంబు పెకల్చివైచి
యుయ్యాల లూఁగెడునొయ్యారమున నెంతొ
ముద్దులొల్కుచు నుండె మోముదమ్మి
చీనాంశుకంబులఁ జెలఁగుటెక్కెములఁ
బొలుచునత్తుంగగోపురములందు
గంటలరవళిచే గణగణ మ్రోఁగుచు
నమరవిమానరూపమును దాల్చి
ప్రాకారములు దాఁటి రయవశమ్మున మీఁది
కెగురుచుఁ గ్రిందికి దిగుచు నుండి
విడచి లాగుట ముందువెనుక కేగుసుయాల
దర్శించువారి కుత్సవ మొలర్ప
తే. గీ. అందియలఘులుఘల్లుల హారతతుల
గణగణల మణిమేఖలాఘంటలఝుణ

ఝణల కంకణము లనుశింజారవముల
నెసఁగునీమె డోలాక్రీడ యింపు గాదె?

విదూష—మిత్రమా! నీవు సూత్రకారుఁడవు; నేను వృత్తి కారుఁడను. సరే, కానిమ్ము. విపులముగా వర్ణింతము.

ఈమెచరణపంకజయుగము మృదువై నయందెలరవళిచే మన్మథుని వృద్ధిపొందించుచున్నది. ఉయ్యాల లూఁగునపుడు కదలుచున్న కటిమండలమునందలి చిఱుగంటలమ్రోఁతనెపమున సంతోషముతోఁ గిలకిల నవ్వుచున్న ట్లున్నది. కదలుచున్నకట్టాణిముత్యాలపేర్లు కుసుమాయుధునికీర్తివల్లికలను విస్తరింపఁ జేయుచున్న ట్లున్నవి.

స్నిగ్ధ మైనచెక్కిళ్లయందుఁ దాటంకయుగళము చలనలీలచే నూయెలయూఁపులను లెక్కింప వేడుక గలిగినట్లు దోఁచుచుండెను. కౌతూహలముచే వికసించినవెడఁదకన్నులు మన్మథునకుఁ గలువపూపుటమ్ముల నందిచ్చున ట్లున్నవి. కదలుచున్నయామెజడ యుయ్యేల నాఁప వల దని శాసించుచున్నకందర్పునికశాదండమువలె నున్నది.

రాజు—కర్పూరమంజరి యుయ్యేలనుండి దిగినదా యేమి? డోలికయు వట్టి దైనదే. నాహృదయమును దర్శనోత్సుక మైన నాలోచనములును గూడ శూన్యము లైనవి.

విదూ—ఆమె మెఱుపుఁదీఁగ మెఱసినట్లు క్షణకాలము కనఁబడి మాయమైనది.

రాజు—మిత్రమా! అ ట్లనకుము. హరిశ్చంద్రపురి వలె దృష్టమై నష్టమైనది. (స్మృతి నభినయించి)

తే. గీ. ఒప్పు మాంజిష్ఠవర్ణ మై యోష్ఠముద్రి
పుటము బెట్టినబంగారు బోటిమేను
దృష్టి యన్ననో బాలేందురేఖ గెలుచు
కజ్జలసమంబు కుంతలకాంతి యౌర!

తే. గీ. ఇట్టి బహువర్ణ రేఖల నెసఁగుచున్న
యీహరిణనేత్రి విహరింప నీధరిత్రి
యువజనంబుల గెలువ నుద్యుక్తుఁ డయ్యెఁ
బూవుటమ్ములుఁ జెఱకువిల్ బూని మరుఁడు.

విదూ—మిత్రమా! యిదియే మరకతపుంజసౌధము. నీ విందుఁ గూరుచుండి యామెరాక నిరీక్షించుచుందుము. సాయంకాల మగుచున్నది.

(ఇద్దఱు నం దాసీనులగుదురు.)

రాజు—మిక్కిలి చల్లని దైనను సీమంచు నాకుఁ దాపము గలిగించుచున్నది.

విదూ—దేవా! హిమానీసహచరుఁడ వైతివి. క్షణకాల ముండుము. ఇంతలో శిశిరోపచారసామగ్రిని సమకూర్తును. విచక్షణ యిప్పు డీలాగు వచ్చుచున్నది కారణ మేమిచెపుమా!

రాజు—మంత్రులు చెప్పిన సంకేతకాల మాసన్న మైనది.

(స్మృతిదెచ్చుకొని మదనావస్థ ననుభవించును.)

తే. గీ. లేమకరచరణంబులు లేఁజిగుళ్లు
నల్లకలువపూరేకులు నయనములును
ముఖము జాబిల్లి సంపంగిపువ్వు మేను
అయినఁ దాపంబు గలిగించె నక్కజముగ.

విదూ—(చక్కఁగాఁ జూచి) ఓయీ! విచక్షణ శిశిరోపచార సామగ్రిని జేత ధరించి యిటే వచ్చుచున్నది.

(అప్పుడు విచక్షణ శిశిరోపచారసామగ్రితోఁ బ్రవేశించును.)

విచ—(నడచి) ఆహా! ప్రియసఖికి విరహదాహజ్వర మధికముగ నున్నదిగదా.

విదూ—(సమీపించి) విచక్షణా! అది యేమి?

విచక్ష—శిశిరోపచారసామగ్రి.

విదూ—ఎవరికొఱకు?

విచ—మా నెచ్చెలికి.

విదూ—వానిలో నాకు సగ మిమ్ము.

విచ—నీ కేల?

విదూ—మహారాజుకొఱకు.

విచ—మహారాజునకు వీనితోఁ బనియేమి?

విదూ—కర్పూరమంజరికి మాత్ర మెందుకు!

విచ—నీ వెఱుఁగనే యెఱుఁగవా? మహారాజసందర్శనము చేతనే యీమె కట్టియవస్థ సంభవించినది.

విదూ—నీకు మాత్రము తెలియదా? కర్పూరమంజరీసందర్శనమే మహారాజునకు జ్వరకారణము.

ఇద్దఱు—(నవ్వుచున్నారు.)

విచక్ష—మహారా జెక్కడ నున్నాఁడు

విదూ—నీమాటప్రకారమే మరకతపుంజసౌధమునను న్నాఁడు

విచ—నీవు మహారాజుతోఁగూడ నామరకతపుంజద్వారముననుండుము.

విదూ—(నిరాదరణముతో) ఇంక నీవు పొమ్ము! (మరల నామెతో) మరకతద్వారమున నుండవలయును గదా!

విచ—దేవిగారియాజ్ఞాప్రకారము కర్పూరమంజరి యిక్కడకు వచ్చును.

విదూ—దేవిగారియాజ్ఞ యేమని?

విచ—దేవిగారు మూఁడు లేఁతచెట్లను నాటించియున్నారు.

విదూ—ఆచెట్లపే రేమి?

విచ—కురవక తిల కాశోకములు.

విదూ—సరే, వానితో నిప్పుడేమిపని?

విచ—దేవిగారు కర్పూరమంజరితో నిట్లు చెప్పియున్నారు.

తే. గీ. కోమలి కవుంగలించినఁ గురవకంబు
చూడఁ దిలకంబుఁ, దన్న సశోకకుజముఁ
బూలు పూచి మనోజ్ఞమై పొలుచుఁ గాన
నామహీరుహములకు దోహదము నిడుము.

కావునఁ గర్పూరమంజరి దేవిగారియనుమతిచే నట్లు గావింప నున్నది?

విదూ—మరకతపుంజప్రాసాదమునుండి మహారాజును దీసుకొనివచ్చి యీతమాలవృక్షముచాటున నాసీనుం జేసి, యాతఁడు ప్రత్యక్షముగాఁ గర్పూరమంజరిని జూచున ట్లేర్పాటు గావింతును. (రాజును జూచి) ఓయీ! చెలికాఁడా, నీవు లేచి నీహృదయసముద్రచంద్రలేఖను దిలకింపుము.

రాజు—(అట్లు చేయుచున్నాఁడు.)

[అప్పుడు చక్కఁగా నలంకరింపఁబడినకర్పూరమంజరి ప్రవేశించుచున్నది.]

కర్పూ—విచక్షణ యెక్కడ నున్నది?

విచ—(సమీపించి) సఖీ! దేవిగారియాజ్ఞ ననుసరింపుము.

రాజు—మిత్రమా! అది యేమి?

విదూ—తమాలవృక్షముచాటుననుండి చూచి తెలిసికొమ్ము.

విచ—(కర్పూరమంజరితో) ఇది కురవకద్రుమము.

కర్పూ—(కురవకమును గౌఁగిలించుకొనుచున్నది.)

రాజు—

క. నవకురవకవృక్షంబును,
నవలా కౌఁగిటను జేర్ప నవకుసుమము లు
ద్భవ మయ్యె, వానికొఱకై
యవిగో! తుమ్మెదలుచూడు యాత్రిలు చేసెన్.

ఓయీ! చూడుము చూడుము. ఈమ హేంద్రజాలము.

విదూ—కురవకతరువు చిన్నదయ్యును నీతరుణీమణియాలింగ
నముచే మదనబాణములవలెఁ బువ్వులను వెదచల్లుచున్నది.

రాజు—ఇట్టిదియా దోహదప్రభావము!

విచ—ఇదిగో! ఈవైపున నున్న దే తిలకవృక్షము.

కర్పూ—(చాలసే పోరకంటఁ జూచుచున్నది.)

రాజు—

చ. సలలితమున్ విలోలము నిశాతము కజ్జలకాంతియుక్తమా
కలికిపిసాళిచూపు తిలకంబుపయిం బడ, దానిమేనిపైఁ
బులకలు దోఁచుచందమునఁ బూవులు పూచెను, విల్లు బూని పూ
విలుతుఁడు నామెపార్శ్వమున వేడుకతోఁ జరియించు చుండెడిన్.

విచ—సఖీ! రమ్మ. ఇదే యశోకవిటపి.

కర్పూ—(కాలితోఁ దన్నుచున్నది.)

రాజు—

చ. కమలదళాక్షి యందియలు ఘల్ఘలు మంచుమ్రోయ నాయశో
కమునకుఁ దాడనోత్సవము గ్రన్నన సేసెను, జేయఁగానె య
గ్రములను బువ్వుమంజరులు క్రందుకొనెన్ గగనాంగణంబు లో
కమునకు దర్శనీయ మయి కన్పడియెన్ క్షణకాల మింత్తటిన్.

విదూ—వయస్యా! దేవి తాను స్వయముగా నీదోహదము
సేయకుండుటకుఁ గారణ మేమో నీ వెఱుంగుదువా?

రాజు—నీకుఁ దెలియునా?

విదూ—నీ వాగ్రహింప కుందువేని జెప్పెదను.

రాజు—ఇందుఁ గోపకారణ మేమున్నది? నీయిచ్ఛవచ్చిన చొప్పునఁ జెప్పవచ్చును.

విదూ—నెరజవ్వని యగునీమెదోహదమువలనఁ గలిగినంతఫలితము వయస్సు మరలిన దగుటచే దేవిగారికి సాధ్యము గాదేమో యని నాయుద్దేశము.

జు—

తే. గీ. చపలచిత్తలు బాలికల్ సహజముగను
గాన సేయఁబూనదు రిట్టికార్యములను,
నలరువిలుకానిమేటిరహస్య మెల్ల
వాస మొనరించు నిందుజవ్వనమునందె.

విదూ—తరువులు సయితము రూపరేఖారహస్యముచేత వికసించుచున్నవి. రతిరహస్యమును మాత్ర మెందుకు గ్రహింపవు?

(తెరలో వైతాలికుఁడు)

మహారాజున కీసంధ్యాకాలము సుఖము నిచ్చుఁగాక!

చ. కమలవనంబు భూజనులకన్నులతో నరమోడ్చెఁ, దీక్ష్ణభావము విడనాడె భాస్కరుఁడు, భామలమానసవృత్తితో మయూఖము లతిశోణసూత్రములకై వడి నొప్పెఁగఁ జక్రవాకమిత్రము చరమాద్రిఁ జేరె నికరం బగుకిత్తలిపండుచాయతో.

రాజు—మిత్రమా! సాయంకాల మైనది.

విదూ—వందులు సంకేతకాలము నెఱిగించుచున్నారు.

కర్పూ—సఖీ, విచక్షణా! చాల ప్రొద్దుపోయినది. మన మింకఁ బోవుదము రమ్ము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

రెండవ తెర.

—:o:—

శ్రీ ర స్తు.

# కర్పూరమంజరి.

తృతీయజవనికాంతరము

[అంతట రాజు, విదూషకుఁడు ప్రవేశించుచున్నారు.]

రాజు—(ఆమె నుద్దేశించి)

తే. గీ. చంద్రమండలలావణ్యసరణిఁ గలుగుఁ
బడఁతిముందఱ నాచాయపసు పదేల?
కుందనం బేల చంపకకుసుమ మేల?
పోలుపు మీఱునా కేసరీపుష్ప మేల?

వెండియు,

చ. మరకతగుంఫితంబు లగుమౌక్తికహారములట్లు బాలబం
భరయుతమాలతీకుసుమమంజరులట్లు దనర్పు తారలం
బెరసెడువాలుఁజూపులను ప్రేయసి న న్గనుఁగొన్నయప్పుడే
చొరఁబడె నీమె నాదుమనసున్; బలుమాటలతోడ నేమిఁకన్.

విదూ—చెలికాఁడా! నీవు భార్యకు వశుఁడవైన ట్లేదో యాలోచించు చున్నా వేమి?

రాజు—మిత్రమా! కలలో నేఁ జూచినదానినిగుఱించి తలఁచుకొను చున్నాను.

విదూ—మిత్రమా! ఆవిషయము నాతోఁ గూడఁ జెప్పుము.

రాజు—

చ. తలిమముమీఁదఁ బండుకొనఁ దన్వి ననుం గలలోన, జూపు లన్
గలువల మోదఁగాఁ దలఁపఁ గొఁగిటఁ జేర్చితి నంత నామె య
వ్వలకును బోవఁజూడ వెనఁ బట్టితి చీరచెఱంగు, దాని నా
చెలి విడిపించుకొంచుఁ జనెఁ జెచ్చెర నిద్రయుఁ బోయె దానితోన్.

విదూ—సరే! అది యట్లుండనిమ్ము. నిన్నరాత్రి నాకుఁ గూడ నొకవింతకల వచ్చినది.

రాజు—నీకుఁ గలిగినస్వప్న మేదియో నా కెఱింగింపుము.

విదూ—నేను కలలో గంగానదిలోఁ బరుండి నిద్రించితిని. హరునిశిరమునందుఁ బాదము లుంచినగంగానదీజలములచేఁ గడుగఁ బడితిని.

రాజు—తరువాతఁ దరువాత?

విదూ—పిదప శరత్కాలమునందు వర్షించుమేఘము నన్ను దాగి వేసినది.

రాజు—ఆశ్చర్య మాశ్చర్యము.

విదూ—అంత భగవానుఁడు సూర్యుఁడు స్వాతినక్షత్రమును బ్రవేశించినపు డామహామేఘము తామ్రపర్ణినదీతోయములతోఁ గూడినసముద్రమును జేరెను. మేఘగర్భస్థుఁడ నై నేను నక్కడకుఁ జేరితిని.

రాజు—తరువాతఁ దరువాత?

విదూ—తరువాత నామేఘము పెద్దచినుకులతో వర్షము గురిపించెను. అంత నారత్నాకరమునం దున్న ముత్తెపుజిప్పలు వర్షబిందువులతోపాటు నన్నుఁ గూడఁ దాగినవి. అనంతరము బదిమాసములకుఁ బెద్దముత్తెము నై యుం దుంటిని.

రాజు—తరువాతఁ దరువాత?

విదూ—అనంతరము క్రిమక్రమమున నలువదినాలుగుముత్తె పుజిప్పలయం దుండి యుజ్జ్వలమును స్థూలమును సువర్తులము నగు నవమౌక్తికత్వమును బొందితిని.

రాజు—తరువాతఁ దరువాత?

విదూ—అందుచే నే నిప్పు డాముత్తెపుజిప్పలయందున్న యీ నవమౌక్తికము నే యని తలంచుచున్నాను.

రాజు—తరువాతఁ దరువాత?

విదూ—తరువాతఁ బరిణతకాలమున నాముత్తెపుజిప్పలు సముద్రమునుండి తీయఁబడి విప్పి చూడ నేను చతుష్షష్టిముక్తాఫలత్వము బొందియుంటిని. అంత నొకవర్తకుఁడు లక్షసువర్ణముల నొసఁగి దానిని గొనెను.

రాజు—ఓహో! నీస్వప్న మెంత చిత్రముగా నున్నది. తరువాత నేమి జరిగినది?

విదూ—ఆవర్తకుఁడు వేధకారునిచేత ముత్తియములకుఁ దొల్లులు చేయించెను. నాశరీర మాకారణముచేతనే నొచ్చుచున్నది.

రాజు—తరువాత?

విదూ—ఆముత్యములు పదిమాసములకు ఫలించుముత్యములతో గలిపి యొంటిపేటహారముగఁ గూర్పఁబడెను.

రాజు—తరువాత?

విదూ—తరువాత దాని నొకపేటికయం దుంచి సాగరదత్తుఁ డనువర్తకుఁడు పాంచాలాధిపుఁడై నవజ్రాయుధునికిఁ జూపఁ గన్యాకుబ్జనగరమునకుఁ గొంపోయెను. అక్కడ నది కోటిసువర్ణముల కమ్ముడు వోయెను.

రాజు—అటుతరువాత?

విదూ—తరువాత నా హారము నాభూపాలుఁడు తనరాణి కిచ్చెను. అనుకూల మైనవస్తులాభమునకు విదగ్ధులు సంతసింతురు గదా! ఆరాజదంపతులు వెన్నెలలోఁ గ్రీడించుచుండ వారిపరిరంభణములలో జిక్కువడి యాహారము పొడి యై పోవ నింతలో మెలకువ వచ్చినది.

రాజు—నీస్వప్న మంతయు నసత్యమే. నేను నాస్వప్నమును జెప్పుచుండ నన్ను వేళాకవిషయమునకు మరల్చుటకై నీవు పన్నిన చమత్కార మిది.

విదూ—మిత్రమా! రాజు భ్రష్టుఁ డై నాఁడు. బ్రాహ్మణుని కాఁకలి యగుచున్నది. ఈబాలరండ యవినీతురాలు. విరహాతురులైనమనుష్యులుమనోరథమోదకములచేతఁ దమ్ము సంతోషపెట్టుకొందురు. కాని, నే నొక్కటి నిన్నడుగుచున్నాను. ఇది యంతయు నెవరి ప్రభావముచే జరుగుచున్నది?

రాజు—ప్రేమప్రభావముచే.

విదూ—దేవిగారియందు స్థిరప్రేమ గలనీవు కర్పూరమంజరి నట్లు తెప్పపాటు లేనికన్నులతోఁ ద్రాగివేయుచుంటి వేమి? కర్పూరమంజరియందుకంటె దేవిగారియం దేగుణములు తక్కువగా నున్నవి?

రాజు—వయస్య! అట్లనకుము.

తే. గీ. ఒక తెమీఁద నిల్చుఁ బ్రేమ యొక్కొకనికి
రమణిరూప మందులకుఁ గారణము గాదు;
ప్రేమకై చక్కఁదనమునే వెదకికొంట
మూర్ఖలక్షణ మని వచింపుదురు బుధులు.

విదూ—ఓయీ! నీవు ప్రేమ ప్రేమ యని చెప్పుచున్నావే, అది యేది?

రాజు—పరస్పరానురాగము గలదంపతులకు మదనునిశాసన
ముచేఁ బ్రరూఢమైనప్రణయగ్రంథిని బ్రేమ యని యందురు.

విదూ—దానిస్వరూప మెట్టిది?

రాజు—

ఉ. ఘోరములౌ వికల్పములకుం వెలి యై యకలంక మౌచు శృం
గారరసప్రధాన మయి కామునిచేత ననుగృహీత యై
చారువిలాసవిభ్రమవిశంకట మై యనురాగపూర్ణ మై
మీఱెడునట్టిభావము సుమీ మహిఁ బ్రేమయటండ్రు పండితుల్.

విదూ—అది యెట్లు గోచరించును?

రాజు—

తే. గీ. బాలఁతులవిలోల దృష్టులపొంత నిలుచు
నెవరిమనసు కామునిచేత నెవరియెడఁద
కరము రసవృద్ధి గాంచు నా కాముకులకుఁ
జిత్తభావంబు గొప్ప దై చెలఁగుచుండు.

మఱియు,

తే. గీ. పరఁగ నంతర్నివిష్టవిభ్రమము గలుగు
ప్రేమ మదనమండన మని పెద్దలండ్రు
గోచరము గాని ప్రేమంబు గూడ జగతి
మన్మథేంద్రజాలం బని మది దలంతు.

విదూ—నిజమైనప్రేమ హృదయమున హత్తుకొని యుండ
భూషణములతోఁ బ్రయోజన మేమి?

రాజు—అది యథార్థమే.

తే. గీ. వలయనూపురమేఖలాప్రతతి యేల?
చక్కఁదన మేల? యితరభూషణము లేల?

సుందరులు చారుసుభగత్వ మొందునట్టి
ఫక్కి వేఱె యున్న దోకండు నిక్కముగను.

వెండియు,

తే. గీ. నృత్యగేయంబు లేటికి? నేటికి సుర?
పసుపుగుంకుము లేల? ధూపంబు లేల?
విశ్వమందున మధురత్వవిషయమునను
ప్రేమఁ బోలినదున్న దే వే ఱొకండు.

మఱియు,

తే. గీ. జగతి సామాన్యునింతికిఁ జక్రవర్తి
గృహిణికిని భేదమే లేదు ప్రేమయందు;
మణివిభూషణకుంకుమాంబరగణంబె
భేదభావంబు గలిగించు, లే దితరము.

మిత్రమా! యింకను,

తే. గీ. బెళుకుఁగను లేల శీతాంశుబింబతుల్య
మైన మొగ మేల మేటిసోయగ మదేల
ప్రియునిహృదయంబునం దుండి ప్రేయసి చన
కుండునట్టిసాధనము వే ఱొకటి యుండు.

విదూ—అయిన బాల్యమున సుందరము గానిశరీర మైనను, తారుణ్యమున నది మనోజ్ఞముగాఁ గన్పట్టును. అది యెందుచేతనో యెఱిఁగింపుము.

రాజు—చెలికాఁడా!

తే. గీ. తనువు నిర్మించి యౌవనదానదక్షు
లగుప్రజాపతు లిర్వు రీయవనిఁ గలరు;
ఒక్కఁ డంగంబు సృజియించు యువతులకును
వృద్ధి ప్రకటించు దాని ద్వితీయుఁ డెలమి.

అందుచేతనే,

చ. సురుచిరకాంచికావలయసుందరనూపురవాసలక్ష్మి స
న్మరకతరత్నగుంఫితసమంచితహారనికేతనంబు హృ
ద్ధరణసమర్థమంత్రనవయౌవనధారిణి యీలతాంగి యా
స్మరున కమోఘదిగ్విజయసాధక మాఱవబాణ మయ్యెడున్.

ఆలాగే,

తే. గీ. అమితలావణ్యపూర్ణ మైనట్టిమేను,
వీనుదోయిని దాఁకెడు వెడఁదకనులుఁ
జారుతర మైనపీనవక్షస్స్థలంబు
పిడికిటం బట్టఁ దగినట్టిపిన్ననడుము
శకటచక్రంబునుం బోలుజఘనసీమ
యనెడుబాలికపంచావయవము లహహా!
శంబరారాతివిజయధ్వజంబులట్లు
శోభఁ గూర్చుచు నున్నవి క్షోణియందు.

[తెరలో]

సఖీ! కురంగికా! యీశీతలోపచారములచేఁ దామరతీఁగ వోలె వాడిపోవుచున్నాను.

చ. విసమటు తమ్మితూఁ డడరు, భీకర, మహాఫణియట్లు హారమున్
విసరుచు నుండె నిప్పులను వీవనగాలియు, నగ్నియట్ల యం
త్రసలిలమున్ శరీరమునఁ దాపము గొల్పెడు, మంచిగందపున్
రసమును మాన్పఁజాల,దవురా! తనుదాహ మొకింత యేనియున్.

విదూ.—మిత్రమా! వింటివా! అమృతంపుఁబుక్కిలింతలచేఁ జెవులు పూరింపఁబడినవి. ఎండగాడ్పులకు వాడిపోవు తామరకాడను వీక్షించుచుంటి వేల? కేళికుంకుమస్థలము వేఁడినీళ్ళచే దడుపఁబడు

చున్నది. ఏకావళి చూర్ణమైపోవుచున్నది. గంధహారణముచే మాంచి పత్రి పచ్చాకుమ ళ్లల్లల నాడుచున్నవి.

నీకల నిజమే యైనది. రమ్ము పోవుదము. మకరధ్వజుని కేతన మెత్తుము. కంఠకుహారమునఁ బంచమారావ మాలపింపుము. బాష్ప ప్రవాహము నాఁపివేయుము. నిట్టూర్పులు మందగింపఁ జేయుము. లావణ్యము మరల నవభావము బొందును. కాన నిదిగో! ఈసురంగ ద్వారమునఁ బ్రవేశింతము రమ్ము.

[అంతఁ గర్పూరమంజరియుఁ గురంగికయుఁ బ్రవేశించుచున్నారు.]

కర్పూ—(భయముతో) అమ్మో! గగనాంగణమునుండి నేల కవతరించినహారిణాంకుఁడా యితఁడు? లేక తుష్టుఁ డైనసీలకంఠునిచే మరల నిజదేహమును బొందినమనోభవుఁడా? హృదయమును వేధించువాఁ డై నను గన్నులకు సజ్జనుఁ డై నన్ననుగ్రహించుచున్న ట్లున్నాఁడు. సఖీ! కురంగికా! ఇది యింద్రజాలమువలెనున్న దే.

విదూ—(రాజుచేయి పట్టుకొని) నిజమే యిది యింద్రజాలమే.

కర్పూ—(సిగ్గు పడుచున్నది.)

కురంగి—సఖీ! కర్పూరమంజరీ! మహారాజు నెదుర్కొని గౌరవింపుము.

కర్పూ—(లేవఁ బోవుచున్నది.)

రాజు—

తే. గీ. నానిమిత్తము లేచి నీనడుమునకును
బీడ గలిగించుకొనఁ బోకు బిసరుహాక్షి!
కూరుచుండఁగా నినుఁ గనుఁగొన్న నైన
నాకనులు నిశ్చయముగ ధన్యంబు లగును.

మఱియు,

తే. గీ. చంపకంబును గనకంబు చాయపసుపు
నెవతెయుండఁ బ శోభింప వించుకేని
నట్టి నినుఁ గన్నకన్నుల నంబుజాక్షి!
పూజ సేయుదు బంగారుపూలతోడ.

విదూ—ఈకర్పూరమంజరిశరీరమునకు గర్భగృహావాసముచేఁ జెమ్మటలు పట్టినవి. ఇదిగో, నాయుత్తరీయపుఁజెఱఁగుతో విసరెదను. అయ్యో! నాయుత్తరీయాంచలపుగాలిచే దీప మాఱిపోయినది. కానిమ్ము! లీలోద్యానంబునకుఁ బోయెదను. ఓహో! అంధకారనృత్యము జరుగుచున్నది. ఈసారంగములోనుండి యుద్యానవనమునకుఁ బోవలెను.

రాజు—

తే. గీ. చెలియ పాణిపల్లవము నాచేత నుంచి
నాకు నానంద మగునట్లు నడుపు మీవు
కేళిగమనంబునందు నొక్కింతకాల
మంచపిండు నిన్ జూచి లజ్జించునట్లు.
(స్పర్శసుఖ మభినయించి)

తే. గీ. కడిమిపువ్వుల కేసరగణముపోల్కిఁ
జేఁదుదోసపాదులముండ్ల చెలువు దాల్చి
నీకరస్పర్శనంబున నెలఁతమిన్న!
పొడమె నామేన నెన్నియో పులక లిపుడు.

[తెరలో మొదటి వైతాళికుఁడు.]

సీ. ఈపండువెన్నెల భూప! దేవరవారి
కమితసౌఖ్యప్రదం బగును గాక

దేవ! భూగోళంబు తిమిరానుబంధమ
లిన మయి వృక్షంబులీల నుండెఁ
దొలిదెస నిండువెన్నెలచేత నవభూర్జ
పింజరముఖ యయి వెలయు చుండె
ముచికుంద కేసరంబులశోభ ననుకరిం
చెడుతనకరముల విడిచిపెట్టి

తే. గీ. గగనమండలమునఁ గళాక్రమముచేతఁ
బూర్ణబింబత్వమును బొంది పొలుచుచుండె
క్షోణినాయక! యల్లదె చూడు మయ్య
హిమమయూఖుండు కన్నుల కింపు గదుర.

మఱియు,

చ. జనసుత మై యకుంకుమ మచందన మానవభూష నాదిశాం
గనల కకుండలంబును నకంకణ మాతొడ వీజగత్త్రయం
బునకు నశోణనంబును నమోహన మాశర మిక్షుధన్వి కం
చనఁ దగు శీతభానుకిరణావళిఁ బ్రోవులు గట్టె నింగిపై.

విదూ——ఓయీ! కనకదండుఁడీ వెన్నెలను జక్కఁగా వర్ణిం
చినాఁడు. ఇంక మాణిక్యచండుఁడు వర్ణింప వలసియున్నది.

[రెండవ వైతాళికుఁడు.]

సీ. ధూపార్థ మగురువత్తులు కాలుచున్నవి
తేజరిల్లెడు మణిదీపవితతి
వ్రేలుచున్నవియ ముత్యాలతీఁగలు మార్గఁ
బరుగెత్తుచున్నవి పావురములు
సవరింపఁ బడియుండెఁ జక్కఁగాఁ బాన్పులు
వినవచ్చె దూతికావితతినుడులు

పాన్పుల మానినుల్ పవళించి యుండిరి
ప్రణయకోపము గల్గి పతులమీఁద

తే. గీ. అహహ! యిచ్చటిలీలాగృహంబు లెల్ల
నీ తెలుంగునఁ గందోయి కింపు గొలిపి
వెలయు చున్నవి యీసంధ్యవేళయందుఁ
బుష్పసాయకుని విహారభూములట్లు.

సీ. అష్టదిక్కాంతాముఖాంభోరుహములఁ గ
ర్పూరరసమ్మును బూసినట్లు
సర్వజనానందచందనరసమట్లు
సన్నవెన్నెల వెదఁచల్లుకొనుచుఁ
గడు జీర్ణమైనట్టికందర్పకందము
మొజ్జగంబులయందు మొలవఁజేసి
చంద్రమయూఖముల్ సజలపయోధర
ధారలకై వడిఁ దనరుమింట

విదూ—

తే. గీ. అంబరసరోవరంబున కంచ యగుచు
దశదిశాంగనలకు నవతంస మగుచుఁ
గలయికల కన్నిటికి మూలకందమగుచుఁ
జదలఁ బ్రసరించు చున్నాఁడు చందమామ.

చందురుఁడు గేదెపెరుఁగుతోఁ గలిసినవరియన్నము వలె మిక్కిలి తెల్లగా నున్నాఁడు.

కురంగి—

తే. గీ. చందురునిచేత గరువంబు చాల హెచ్చఁ
బ్రమదమానినీమానఘురట్టమైన
పంచశరుఁడు తీవ్రముగ జృంభించినాఁడు
కరమునను నవచంపకశరము దాల్చి.

(కర్పూరమంజరిని జూచి) ప్రియసఖీ! నీవు రచించిన చంద్రవర్ణనమును మహారాజునెదుటఁ జదివెదను.

(కర్పూరమంజరి సిగ్గుపడుచున్నది. కురంగిక చదువును.)

తే. గీ. ధవళ మైన చంద్రమండలి దనరుచుండె
దంతపంజర మట్టులు దానిలోన
లలిత మైనట్టియామృగలాంఛనంబు
గ్రాలుఁ బెంపుడుకోయిలకరణి నహహా!

రాజు—ఆహా! కర్పూరమంజరికవిత్వ మెంత రసవంతముగ నున్నది. భావము నూతనము. పదములు మృదువులు. చమత్కార మైనపలుకులు. (కర్పూరమంజరిని జూచి)

తే. గీ. ముదిత! నీమోమునకుఁ దనమోమునకును
గలుగు భేదంబుఁ దెలుపంగఁ దలఁచి కాదె
బింబఫలకంబునందు జాబిల్లి నేఁడు
పాముకొనె మసి లాంఛనవ్యాజమునను.

మఱియు,

తే. గీ. ధవళఖటికారసంబును దరళనయన
ముఖముమీఁద నీ విప్పుడు పూసికొనుచుఁ
జెక్కుదోయిని గాటుకచుక్క లిడిన
నంత నీమోము చంద్రసామ్యంబు నొందు.

(చంద్రునుద్దేశించి)

తె. గీ. శీతకిరణుఁడా! నీ వేల సిగ్గు లేక
సఖిముఖప్రాంతములయందు సంచరింపఁ,
గలికి పాండురగండభాగంబునుండి
తెలుపు నీ కిచ్చె ననుమాటఁ దెలియ వొక్కొ.

[తెరలోఁ గలకలము. అందఱు నాలకించుచున్నారు]

రాజు—ఈకోలాహల మెక్కడిది?

కర్పూ—(భయముతో) ప్రియసఖీ! అది యేమో తెలిసి కొని రమ్ము.

విదూ—దేవిగారు మామిత్రున కేదో వంచన చేయుచున్నట్లున్నది.

కురంగి—ప్రియసఖీ! మహారాజునకు నీతోడిచెలిమిని గ్రహించి యాయనకుఁ దగినపని చేసి, దేవి యీపరిక్కకు వచ్చుచున్నది.

కర్పూ—మహారాజా! నేను వచ్చినదారినే తిరిగి పోవుటకు సెలవిండు. దేవి నే నిక్కడకు వచ్చినట్లు జూడకుండ సురంగద్వారమున నేగి రక్షాగృహమును బ్రవేశింతును.

మూఁడవతెర.

శ్రీ ర స్తు.

# కర్పూరమంజరి.

చతుర్థజవనికాంతరము

[అప్పుడు రాజు, విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.]

రాజు—ఆహా! గ్రీష్మము మిక్కిలి తీవ్రముగ నున్నది. పడమటిగాడ్పులు వేఁడిగ వీచుచున్నవి. ఎట్లు సహింపవచ్చును.

తే. గీ. జరఠరవిసమేతం బైన సమయ మొకటి
ప్రియజనంబులతోడుత విరహ మొకటి
దుస్సహంబు లటంచును దోఁచె మదిని
మారశరగోచరుల మైనమానవులకు.

విదూ—కొందఱు మదనునిచే బాధ నొందుదురు. కొందఱు గ్రీష్మతాపమున శోషింతురు. నాబోంట్లను కాముఁడు బాధింపఁడు. గ్రీష్మతాపము శోషింపఁ జేయదు.

(తెరలో)

అందుచే నేను సీతల బ్రిద్దలుగొట్టుదును.

రాజు.—వయస్యా! లీలోద్యానమున స్వేచ్ఛగాఁ దిరుగు కేళిశుక మేమని పలుకుచున్నది?

విదూ—ఓరీ, దాసీపుత్ర! నిన్నుఁ గొఱత వేయింపఁ దగును.

(మరలఁ దెరలో)

మాకు తెక్కలు లేనివో నది నీయుద్దేశప్రకారమే జరుగును.

రాజు—అయ్యో! యెగిరిపోయినదే.

తే. గీ. అమితదీర్ఘవాసరములు, హ్రస్వనిశలు,
భానుబింబచండత, శశిహీనదశయుఁ,
గలుగుమండువేసఁగిఁ జేయు కమలభవుని
ఛురకతోఁ దుత్తునియలుగ నఱుకఁ దగదె?

మఱియు సుభగసమాగమము సమకూడినచోఁ గాలము సుఖముగాఁ గడుపవచ్చును.

తే. గీ. గంధపుంబూఁత మధ్యాహ్నకాలమందు
నార్ద్రవస్త్రధారణము సాయంతనములఁ
బూఁటపూఁట మజ్జనము చన్నీటియందు
శీతలసుగంధవారుణీసేవనంబు,
నిబిడపశ్చిమయామినీనిధువనములు,
నసమశరునకుఁ బదునైన యాయుధములు
చైత్రయాత్రాసమారంభసమయమందు
శేషశస్త్రముల్ జీర్ణమై శిథిలమగుట.

విదూ—మిత్రమా! అట్లనకుము. తెల్లనికాంతిచేఁ బూయఁబడిన తమలపాకులతీఁగలతోఁ దియ్యమామిడిపూఁదేనె వోలె స్నిగ్ధమైన పూగఫలములతో నొప్పారుచుఁ గర్పూరవాసితమైన చందనపంకములతో నలరారు నిదాఘదినములకు జయ మగుఁ గాక!

రాజు—ఇది మఱింత శోభించుచున్నది.

మ. చెవికిం జల్లగఁ బంచమస్వరములన్ జెన్నారు వేణుధ్వనుల్
చవికిం జల్లగ శీతలోదకమటుల్ భాసిల్లునా వారుణీ

ద్రవముల్, గంధ మలంది మేనఁ బ్రియమారఁగ శయ్యకుం జల్లనౌ యువతుల్ మందులు గూర్చ వేరికివి యత్యుత్సాహ మీ వేసవిన్.

మఱియును,

సీ. ఔదల మృదువైన యాదిరిసెనపూవు
వక్షంబునను సిందువారమాల
తనువల్లియందునఁ దడిసినవస్త్రంబుఁ
గలువలమొలనూలు గటితలమున
దోర్యుగంబునఁ దమ్మితూఁడులకడియంబు
లనునవే యెంతయు నరసి చూడఁ
గామరోగమునకు ఘనమైనవైద్యంబు
భీష్మమైనట్టియాగ్రీష్మమందు

తే. గీ. విమలమధుమాసదివసముల్ వెళ్ళెఁ గాన
విరహతాపార్తిఁ జెందెడివెలఁదుకలకు
నట్టివేసంబె భావ్యమై యమరుచుండు
నన్యవిధమైన సంతాప మధిక మగును.

విదూ— నే నొకటి చెప్పుచున్నాను వినుము! మధ్యాహ్నకాలమందుఁ జిటిలిన మంచిగంధములు గలిగినట్టియు, సాయంకాలము నిరంతరమైన చన్నీటిస్నానము గలట్టియు, రాత్రులందు వీవనలనుండి జాఱు నీటిబిందువులతోఁ దడుపఁబడునట్టియు నబలలకుఁ బంచశరుఁడు దాస్యము చేయుచున్నాఁడు.

రాజు—

చ. అరుగు నిమేషముల్ బలె నహస్సులు దీర్ఘము లయ్యు రూపవి
స్ఫురణము సాధుసంగతియుఁ బూర్తిగఁ గల్గినవారి; కక్కటా!
యరుగును మాసముల్ బలె నహస్సులు నెమ్మది భోగకాంక్షలన్
బూరయక గాఢతాపమును బొందెడువారికి మందు వేసవిన్.

మిత్రమా! ఆమెవార్త యేమైనఁ దెలిసినదా?

విదూ — ఆఁ తెలిసినది. ప్రియమిత్రమా! వినుము. నేను నీ కొకశుభవార్త జెప్పెదను. దేవి రత్నాగృహద్వారముకడఁ గర్పూర మంజరిని జూచినదిమొద లాసురంగద్వారము పెద్దపెద్దఱాళ్ళతో దట్టముగాఁ గప్పివేయించినది. అనంగసేన, కళింగసేన, కామసేన, వసంతసేన, విభ్రమసేన లను పంచసేనానామధేయలైన చామరధారిణుల నధ్యక్షులుగాఁ జేసి, ధగధగ మెఱయుకరవాలములు ధరించిన వేయి మందిపదాతివర్గమును రత్నాగృహమునకుఁ దూర్పుదిక్కున నుండ నియమించినది. అనంగలేఖ, చిత్రలేఖ, చంద్రలేఖ, మృగాంకలేఖ, విభ్రమలేఖ లను లేఖానామధేయ లగు నైదుగురు సైరంధ్రు లథి జ్యశరాసను లైనధానుష్కసహస్రముతోఁ గూడ దక్షిణపుదిక్కున నియమింపఁ బడిరి. కుందమాల, చందనమాల, కువలయమాల, కాంచనమాల, వకుళమాల, మంగళమాల లనుమాలానామధేయ లగు నేడ్గు రడపకత్తియలు నవనిశితకుంతహస్తపదాతిసహస్రముతోఁ బశ్చిమదిశను నియమింపఁబడిరి. అనంగకేళి, పుష్పకేళి, కందర్పకేళి, సుందరకేళి, ఉత్పలకేళి, యనుపంచకేళీనామధేయలు మజ్జనకారిణులు ఫలకఖడ్గభీషణు లైన వేయిమందికాల్బలములతో నుత్తరదిక్కున నియమింపఁబడిరి. వారిమీఁద మదిరావతి, కేళివతి, కల్లోలవతి, తరంగవతి, అనంగవతు లను పంచవతీనామధేయలు కనకచిత్రదండహస్త లై సుభాషితములు చదువుచున్న వందీనామధేయలైన స్త్రీ లధ్యక్షులుగా నియమింపఁబడిరి.

రాజు — ఆహా! దేవియంతఃపురసామగ్రి యెంత యుచితముగా నున్నది.

విదూ — ఓవయస్యా! ఇదిగో సారంగిక యను దేవిగారిచెలికత్తె నీ కేదియో నివేదించుకొన వచ్చియున్నది.

[సారంగిక ప్రవేశించును.]

సారం—దేవా! జయము. జయము. నేఁడు చతుర్థదివస మగుటచే భావినటసావిత్రీమహోత్సవోపకరణములను గేళీవిమానము నధిరోహించి వీక్షింపు మని దేవి విన్నవింపు మన్నది.

రాజు—దేవియాజ్ఞాప్రకార మట్లే చేసెదను.

[చేటి నిష్క్రమించును. రాజు, విదూషకుఁడును ప్రాసాదము నెక్కుదురు. ఉత్సవము ప్రారంభింపఁ బడును.]

విదూ—ముక్తాఫలాభరణసముదాయము గలిగి, లాస్యావసానమునఁ జలించుచున్న చేలాంచలములతో నొప్పునట్టి వీరు యంత్రజలమును మణిభాజనములచేత నొండొరులపైఁ జిమ్ముకొనుచున్నారు. విచిత్రబంధములు గలిగినయీముప్పదియిరువురు నర్తకులు నృత్యము చేయుచున్నారు. మఱి కొందఱు భుజములు, తలలు సమానముగను, బాహువులు చేతులు సమానముగను గలవారై రెండువరుసలుగా నుండి లయతాలబంధముల నొనర్చుచుఁ బరస్పరాభిముఖులుగా నున్నారు. మఱికొందఱు స్త్రీలు మణిమత్తవారణములను విడిచి యంత్రములచే ధారాసలిలము విరజిమ్ముకొనుచున్నారు. మన్మథునివారణబాణములవలె నున్న మఱికొందఱుస్త్రీలు ప్రియులయంకములందుఁ బడుచున్నారు. కాటుకవలె నల్లనైనశరీరములు గలిగి చాపములఁ దాల్చినమఱికొందఱువనితలు శబరవేషములతో నెమిలిపింఛముల ధరించి జనులను నవ్వించుచున్నారు. చేతులలో నరమాంసమును బట్టుకొని, హుంకారములచే భయంకరస్వరములు గలిగిన రాక్షసస్త్రీలతలలు తగిలించుకొని కొందఱు శ్మశానాభినయము చేయుచున్నారు. మఱియొకయంగన హుడుక్కావాద్య మొనరించుచు మృదుల మగుమద్దెలరవముతోఁ బరిపాటీవిచలము లగుభ్రూలతలతోఁ జేటీకర్మలు చేయుచున్నది.

మువ్వలచే ఝణఝణశబ్దము చేయుచు గీతముల లయమునొందిన తాళములతో యోగినీవలయనర్తనము తాళనూపురరవమనోహరముగఁ జేయుచున్నది. వేణునాదానక్తలై కుతూహలమునఁ జంచలవేషములుఁ గలిగినమఱికొందఱు కాంతలు కాలమునకుఁ దగిన వేషములచే లోకులను నవ్వించుచు వెడలిపోవుచు నమస్కరించు చున్నారు.

సారంగిక—(ప్రవేశించి ముందుజూచి) అదిగో! మహారాజు గారు మరకతపుంజప్రాసాదము నెక్కి కదళీగృహమును బ్రవేశించి యున్నారు. నే నిప్పుడు వారియొద్దకు వెళ్ళి దేవిగారివిన్నపమును మనవి చేసెదను. (సమీపించి) మహారాజునకు జయము! నేఁటిసాయంకాలము మీపరిణయమునకై దేవిగారెల్లప్రయత్నములు చేసినారని మనవి చేయుచున్నారు.

విదూ—మిత్రమా! ఈ యకాలకూష్మాండపతన మేమి?

రాజు—సారంగికా! సవిస్తరముగా నా కావిషయమును దెల్పుము.

సారం—అవధారు! మహారాజ. చతుర్దశఘడియలు వెళ్లిన తరువాత దేవిగారు పద్మరాగమణులతో గౌరీవిగ్రహమును జేయించి భైరవానందునిచేతఁ బ్రతిష్ఠింపఁ జేసియున్నారు. ఆమెగూడ దీక్షగైకొని యున్నది. మఱియు నామె భైరవానందునికి గురుదక్షిణ యేమి కావలె నని యడుగ నాయోగి తన కీయఁదలఁచిన గురుదక్షిణ మహారాజున కొసఁగుట తనకు సమ్మత మనెను. ఆగురుదక్షిణ యిట్టిది—"లాటదేశాధీశుఁడు చంద్రసేనునకు ఘనసారమంజరి యను పేరుగల యొకకుమార్తె గలదు. ఆమెకు దైవజ్ఞులు చక్రవర్తిగృహిణి యగునని భవిష్యమును జెప్పినారు. అందువలన నామెను మహారాజునకు వివాహమగునట్లు చేయవలెను. ఇట్లు చేసినచో గురుదక్షిణ యిచ్చినదాన వగుదువు. భర్తను జక్రవర్తి నొనర్చినదానవు నగుదువు."

అనఁ గా దేవిగారు నవ్వి యాతనితో 'మీయాజ్ఞ నొనరింతు' నని యొప్పుకొనెను. నేను గురుదక్షిణ యొసఁగుటకై మిమ్ములను బిలుచుటకై వచ్చితిని

విదూ—ఈసంఘటనము నెత్తిమీఁదఁ బాము, దేశాంతరమందు విషవైద్యుఁడు వలె నున్నది. ఇక్కడ వివాహము, లాటదేశములో ఘనసారమంజరి.

రాజు—భైరవానందుని ప్రభావము నీ వెఱుఁగనిదా? ఆతఁడిప్పు డెచ్చట నున్నాఁడు?

సారం—దేవిగారు నాటించిన ప్రమదోద్యానమందలి మఱ్ఱిచెట్టుక్రింద నున్నకాళికాలయమం దున్నాఁడు. దేవిగారును వెళ్ళియున్నారు. దక్షిణయు సిద్ధ మొనర్పఁబడినది. వివాహము కుతూహలము గలిగించునది. కాఁబట్టి మీ రిప్పుడే రావలయును.

రాజు—మిత్రమా! ఇది యంతయు భైరవానందుని ప్రేరణ యని తోఁచుచున్నది.

విదూ—అగును! చంద్రుఁడు కాక, చంద్రకాంతశిలాప్రతిమ నెవ్వఁడు కరఁగింపఁగలఁడు? శరదృతువు గాక శేఫాలికాకుసుమములను వికసింపఁ జేయునదేది?

[భైరవానందుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భైర—సురంగద్వారము భేదించి దాని కడ్డముగ నీకాళీవిగ్రహ మిక్కడఁ బ్రతిష్ఠించితిని గదా! (అని చేతులు జోడించి)

తే. గీ. ప్రబలకల్పాంతకేళికాభవనమందు
సహహా! కాలపురాణరక్తాసవంబు
జలజసంభవునికపాలచషకమునను
చండి గ్రోలుచు నుండును సంతసమున.